ఓమ్.

సత్యాసత్యనిర్ణయయుక్తమగు

# న్యాయదర్శనపరిచయము

మఱియు

# కువివాదకుఠారము



Edited by

**A. N. MURTHY.**





PRINTED AT

**The Manjuvani Press,**
**ELLORE,**

**1920.**

రు. 0-10-0]

# కృతజ్ఞతాభివందనములు.

:o:

శ్రీ పరమహంస జగద్గురు శ్రీ గోపాలసచ్చిదానం
దేంద్ర సరస్వతీస్వాములవారు, ఇందుకూరుపేటమఠం.

| | |
|---|---|
| శ్రీ రామస్వరూపదీక్షితులవారు | హైదరాబాదు. |
| శ్రీయుత సుంకు గోవిందశ్రేష్ఠిగారు | కదిరి. |
| ,, రామార్యులుగారు. | పేరాయపల్లె. |
| ,, గా॥ పెద్దవెంకట సుబ్బయ్యగారు | ,, |
| ,, అక్కెం రంగప్పగారు | ,, |
| ,, శింగంశెట్టి వెంకటస్వామిగారు | ,, |
| ,, చల్లపల్లె పెద్దరామయ్యగారు | ,, |
| ,, వంకదారి కొండయ్యగారు | జంబులదిన్నె. |
| ,, సూదలకుంట హనుమంతప్పగారు. | తిరుమణి. |
| ,, సరాబు వెంకప్పగారు | ,, |
| ,, కొండూరు వెంకటసుబ్బయ్యగారు | వరిగి. |
| ,, C. వెంకప్పగారు | గోనిమాకులపల్లె |

శ్రీయుత E. H. సంజీవరెడ్డి చంద్ర

,, తాతా లక్ష్మయ్యగారు హిందూపు

,, కట్టా విశ్వనాథగుప్తగారు ,,

,, ఆనందాశ్రమమండలి ,,

శ్రీమతి సుంకు వెంకటలక్ష్మమ్మగారు కది

,, వంకదార పుల్లమ్మగారు పేరాయప

,, జ్ఞానాంబగారు ,,

,, వేముల సుబ్బమ్మగారు తిరుమ

బ్రహ్మశ్రీ రూపనగుడి సాంబశివరావుగారు ధర్మవరమ

,, సుబ్రహ్మణ్యయ్యర్ గారు ,,

శ్రీయుత అక్కులప్పగారు ,,

,, వి. మాణిక్య మొదలియారుగారు ,,

ఉపర్యుక్త మహాశయులయొక్క సహాయమున

స్వీకరించుచు ధన్యవాదము లర్పించుచున్నారము.

(సంపాదకుడు)

---

పాఠకమహాశయులారా! ఈక్రింది తప్పులను మొదట సవరించుకొని పఠించుటకుఁ బ్రార్థితులు.

# శుద్ధపత్రము

| పే. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 16 | 2 | గాక్షి | గాణ |
| 20 | 1 | గాను | గాని |
| 25 | 3 | పర్వతి | పార్వతి |
| 27 | 2 | మ్గ్గనా | దుర్గింగా |
| ,, | ,, | చుస్న | చున్న |
| 37 | 15 | వీకి | నీటిని |
| 42 | 1,3 | సాపయువ | సావయువ |
| 51 | 13 | అంాజ | అండజ |
| 59 | 1 | ఖండిచ | ఖండించ |
| 63 | 16 | నీరు | వీః |
| 67 | 19 | సూర్య | మార్య |
| 69 | 14 | సాయణా | (సాయణ) |
| 71 | 20 | పరిచయకు | పరిచయులు |

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 79 | 14 | మహాదీయునకు | మహానీయునకు |
| 80 | 3 | ద్వీతీయ | ద్వితీయ |
| 86 | 1 | నాచకుడు | వాచకుడు |
| 95 | 3 | వేక | లేక |
| 96 | 13 | పరివెూ | పరమా |
| 96 | 19 | ద్యిజో | ద్విజో |
| 109 | 5 | వగయం | వ్యయం |
| 102 | 8 | చి | చ |
| 111 | 7 | సూర్య | మార్య |
| 113 | 7 | స్మణ | స్మరణ |
| 113 | 8 | మాస | మానవ |
| 113 | 15 | మునకు | మునగు |
| 116 | 3 | ...చతు | సమెూచతు |
| 117 | 2 | మానకా | మానవా |
| 117 | 4 | మహి | మహిమ |
| 117 | 14 | నాంతమై | వాంతమై |
| 70 | 7 | గనుగొనిన | గనుగొని |
| 113 | 18 | అధిష్ఠాను | అధిష్ఠానాను |

# సత్యాసత్యనిర్ణయము.

యదార్థమనఁగా నేమి యను ప్రశ్న కుత్తర మున్నదున్నట్టు జరిగినది జరిగినట్టు యని చెప్పుచున్నాము గాని యదార్థమిది యని ప్రత్యేకాంశమును తెలియుటలో మాత్రము కొన్ని యంశములందు సులభముగాను మఱికొన్నింటియం దతికఠినముగా నుండును. మనుష్యమాత్రునకు సాధారణ యదార్థజ్ఞానము ప్రాయశః కలిగియున్నది. మనుష్యమాత్రులందఱును జలమును జలమనుచున్నారము, నదిని నది యనుచున్నారము, పర్వతమును పర్వతమనెదము. సూర్య చంద్ర నక్షత్రము లందరికి నొక్కరీతిగ నగుపడుచున్నవి. ఒక మామిడిపండు హిందూదేశవాసి కెట్టి రుచినిఁ గలుగఁజేయునో యదేస్వాదును అమెరికావానికిఁ గలుగఁజేయును. ఒకబాలుఁ డొక వస్తువును దొంగిలించి నేను దొంగిలించలేదని బొంకుచున్నాఁడు. కారణమేమన, వాఁడా యవస్థయందుఁ దానాపదార్థమును దొంగిలించినది తప్పనియు, నాభేదము బయల్పడినచో శిక్షింతురనియు దానిఁ దప్పించుకొనుటకై బొంకవలసివచ్చెననియుఁ దెలిసియున్నాఁడు. అదేబాలునితో బాలకా! రాత్రిలో నాకాశమందుఁ గనిపించు నక్షత్రము లెంత పరిమాణముండునని ప్రశ్న వేసితిమేని మన యింటిలో వెలుగుచుం

డు దీపములంత యుండునని ప్రత్యుత్తర మివ్వవచ్చును. మన మాబాలునకు నిజముదెల్పుటకై అవి మనయిండ్లకంటెను, మన గ్రామములకంటెను, నీభూమికంటెను గొప్పవియని చెప్పితిమేని వాడు మనలను బరిహాసించును. దీనిని మన మజ్ఞానదశ యని పిలిచెదము. మనకు పృథ్వి గోళాకారమనియు నది చలించుచు తిరుగుచున్నదనియు దృష్టికిఁ గోచరమగుచుండలేదు. ఎచ్చట మనుష్యుని బుద్ధి ప్రవేశింపజాలదో అచ్చట భ్రమప్రమాదము కల్గుచున్నది. అది మనుష్యులలో కోలాహలమున కాలవాల మైయున్నది. ఇది ప్రాకృతికము, ఈశ్వరీయము, మానవీయమని మూడువిధములని చెప్పవచ్చును. ఎచ్చట మనుష్యునిబుద్ధి ప్రవేశింపదో అచ్చట మానవీయ కల్పితభేద ముండును. మనుష్యుఁ డజ్ఞానముచేతను స్వార్థబుద్ధిచేతను పక్షపాతి యగుచున్నాఁడు. ఒక న్యాయస్థానమం దొకఁడు తప్పుసాక్ష్య మిచ్చినయెడల వాఁడు దండనీయుఁడగును. మతవిషయమం దట్లు కాదు. తుకారాం-సానందుఁడు-మహమ్మదు మొదలగువారు భౌతికశరీరములతో స్వర్గమునకు వెళ్ళియుండిరని పురుషసంపర్కము లేకయే క్రీస్తువు జన్మించెనని యిత్యాది సహస్రాంశములు అస్వాభావికవిద్యచే యసత్యములని సిద్ధమైనను చెప్పినవారికి శిక్ష లేదు. గనుక దేశ మందంధపరంపర వృద్ధియగుచుండును. ఆప్రవాహమును నిలుపుటకుఁ బలువురు పనిచేసినను తొలగించుట మిగుల కఠినమగు

చుండును. మన దేశమం దెప్పుడేరీతి బుద్ధి పురుషార్థములు నశించి యిప్పటి యసంభవములు ప్రమాణరహితములునగు నవవైదిక మతమతాంతరములు స్థాపితములైనవోగాని యీయ ద్భుతమూర్ఖమును తొలగించుట మాత్ర మతికాఠిన్యమై యు న్నది. సత్యాసత్య విమర్శనజ్ఞానము మాత్రము మనుజునకు నై జమే. ప్రతివాఁడును ప్రతిపదార్థముయొక్క మంచి చెడుగులు విచారించి పరీక్షింపక స్వీకరింపఁడు. ఒక స్త్రీ మట్టిపాత్రలను గొనుటకుఁ బోయి పరీక్షించికొనుచున్నది. మన మొక బంగారు ముక్కను నొరపెట్టి సాధారణ పరీక్షయుఁ, బుటముఁబెట్టి విశేష పరీక్షయుఃజేయక పుచ్చుకొనము. ఈలాగున మతసిద్ధాంతము ల నైదువిధములఁ బరీక్షించుటకు అన్వీక్షికీవిద్య యని పేరు, విచారశక్తియు లేనివారు విషయమును మూర్ఖముగ నమ్ము దురు. దీని నివారణార్థమును హేతుజ్ఞానము సంపాదించుటకు ను సత్యాసత్య నిర్ణయసాధనములను మన ప్రాథమికఋషులు మనకిచ్చియున్నవారు, వానినే షట్ శాస్త్రములు అథవా షడ్ దర్శనములని చెప్పుదురు. గౌతమముని కృతమగు న్యాయము, కణాదముని కృతమగు వైశేషికము, కపిలముని కృతమగు సాం ఖ్యము, పతంజలి కృతమగు యోగము, జైమిని కృతమగు మీమాంసము, వ్యాస రచితమగు వేదాంతము లాఱును, దర్శ నములు. సత్యాసత్యనిర్ణయ మైదువిధములతోఁ జేయఁబడు

చున్నది. 1. ఈశ్వరుఁడు, అతని గుణ కర్మ స్వభావములు వేదము. 2. ప్రత్యక్షాది ప్రమాణములతో గూడిన హేతువాదము 3. సృష్టిక్రమము, ప్రకృతివిద్య, 4. ఋషి మునీశ్వరాదుల సత్యాచరణము, ఆప్తవ్యవహారము. 5. పవిత్రత్వము. ఏది మనకు నిస్సంశయముగను విస్పష్టముగను సత్యము తెలియదో అది మిగుల భయానకమని తత్త్వవేత్తలు చెప్పియున్నారు. యదార్థజ్ఞానము మానవునియందు దేవభావ ముత్పన్నముఁజేయును. ఆత్మయు, శరీరము, యదార్థజ్ఞానబోధ నీమూఁడును జేరినప్పుడు నిజమైన మనుష్యుఁ డగుచున్నాఁడు. సత్యమును నిరూపించు వానికి శాస్త్రములని పేరు. " మైర్మానవేషుబహుసత్యమయీ సమీక్షాజాయేత విశ్వబలయే ఖిలలోకజాతే, సత్యానురూప విషయ ప్రతిపాదనేన శాస్త్రాణితాని నిగదంతిబుధాఃసమాసాత్" అనఁగా మనుష్యులకొఱకు సత్యవిద్యయు దాని ప్రతిపాదనము చేయు గ్రంథములకు శాస్త్రములని పేరు. లోకములో మత మతాంతరులు స్వార్థులై భిన్న భిన్న స్వర్గ నరకములు, భిన్న భిన్న దేవతలు, భిన్నములగు నీశ్వరగుణములు కల్పించియున్నారు. మత మొకవైఖరి అథవామాదిరి లేక శృంగారమని చెప్పినను తగియుండును. కేవల మగుపడుచుటకు మాత్రము మతమును స్వీకరించినవారును గలరు. గొప్ప గొప్ప ఘటాటోపభక్తిని జూపుచు లోకప్రసాదార్థము మత వేషధారులై యుండు

వారెందరో గలరు. కొన్ని మతములలోని రహస్యమంతయు మతస్థాపకుని స్వమంతవ్యమును వానికిపూర్వముగల మతములలోని కొన్ని నియమములును చేర్పుటవైయున్నది. బుద్ధునియొక్క జీవనమును ఆతనికి పూర్వమునగల కొన్ని మంతవ్యములును చేరి బౌద్ధమత మయ్యెను. మహమ్మదుయొక్క జీవనమును నాతని స్వకీయశిక్షను తీసివేసినయెడల క్రయిస్తువుయొక్క జీవనము నాతని స్వకీయశిక్షయును శేషించును. ఈరెంటిని తీసివైచినయెడల మూసా మంతవ్యములును మూసా సంగ్రహించిన ప్రాథమిక పద్ధతులును మిగులును. దీనిని త్రోసివేసినచో దానికి ముందుండినది శేషించును. ఇట్లు క్రమక్రమముగ నన్నియుపోను తుదకొక సత్యసిద్ధాంతము శేషించును. ఇట్లు చేయక యభిమానవాహనారూఢుండై నచో తప్పక సత్యాసత్య విచారవిహీనుండగుచున్నాడు. తన్నవలంబించిన ప్రతివాడును స్వతంత్ర త్యాగియై సాంప్రదాయబద్ధుండై యుండవలెనని ప్రతి మతమును జెప్పుచున్నది. అర్థాత్ కన్నులుమూసికొని నా వెంబడి రావలసినదని మతము చెప్పుచున్నది. స్వయంప్రజ్ఞలేని మానవులు దాని బోధనలు నిర్దోషములని సమీక్షచేయక యవలంబింతురు. ప్రజ్ఞావంతులు మత నియమములను మిక్కిలి ధ్యానముతో తర్కించెదరు. మొదట స్వకీయమతమును చర్చించి తరువాత పరమత సిద్ధాంతములను శోధించును. ఎందుకన

నొక హిందువు తాను కాశికిపోయినచో ముక్తి యని నమ్మచు మక్కాకు పోవుటవలన లాభములేదని మహమ్మదీయుని ఖండించిన లాభమేమి? ఒక మహమ్మదీయుఁడు రంజాను నుపవాసములు చేయుటవలన మోక్షముఁ గలుగునని నమ్మి హిందువు ఏకాదశి యుపవాసము చేయుట మూర్ఖమని ఖండించిన ప్రయోజన మేమి? ఇది రెండుసర్పము లొకటికొకటి తోకలనుండి మ్రింగిన విధమగును. సత్య మెప్పటికిని కన్నులుమూసికొని నా వెంబడి రావలసినదని చెప్పదు. వాద వివాదములకు భయపడి సరసర పఱుగులిడదు. మంచిబంగారము స్వర్ణకారునకు జడియదు. మాయబంగారము భయపడుచుండును. సత్యాసత్య మిశ్రితములగు మతములన్నియు కొలఁది గొప్ప మనుష్యబుద్ధిని తమ యాధీనముఁ జేసికొని యంధులవలె వెంటఁబడి నడువవలయునని బోధించుచున్నది. మఱియు ననుమానించ కూడదనుచున్నది. తర్కము చేయరాదనుచున్నవి. సత్యమునుండి యసత్యమును, ఆచారమునుండి యనాచారమును, అహింసనుండి హింసనమును, సన్మార్గమునుండి దుర్మార్గమును, సుజ్ఞానము నుండి యజ్ఞానమును, సృష్టించియున్నవి. ఉదాహరణముగ వేదము మానవు లొకరినొకరిఁజూచి మఱియొక రున్నతదశను బొంది సభ్యజనులై ధర్మార్థకామమోక్షములు పడయుట కుద్యమపరులై దేశముయొక్క కల్యాణమునకు మూలాధారులై పరోప

కార నిరతులై స్వార్థత్యాగులై గుణకర్మస్వభావములనుబట్టి వర్ణ నిర్ణయపరులై కుత్సితభేదములకు నవకాశము లేకుండ నైకమత్యమున సోదరభావమున నుండవలెనని శాసించుచుండగా మతము లిందుకు గర్భశత్రువులై పుట్టుకతో వర్ణము వచ్చిన దని ఘోషించుచున్నవి. మానవులకు నానావిధములగు వేషములు వేసి పరస్పరకలహములను బెంచియున్నవి. మానవులను పరదేశములకు పోనియ్యక కల్పిత శాస్త్రపద్ధతి యనెడు సంకెళ్ళతో బంధించినవి. ఈ మతమతాంతర యవాంతరములెన్ని యని వ్రాయనగును. మానవాంగములను కాల్చునది యొకటి ; కత్తిరించునది మఱియొకటి ; బంధించునది వేఱొకటి ; వారిని నిర్బలులను జేయునది యింకొకటి. ఈలాగున ముఖ్యముగ మన భారతీయులను నిరుద్యోగులుగను, అలసులుగను, సాహసహీనులుగను, అల్పాయుష్కులుగను, అల్పబుద్ధులుగను, అశిక్షితులుగను, మూర్ఖులుగను జేసి విడిచియున్నది. విడువడ మెక్కడ? పట్టుకొని వేధించుచునేయున్నవి. అసత్య నిశాగృహమున నీ మతభూతములు మానవులను బడద్రోసినందున వారిదృష్టి యదార్థ పదార్థముపై బడజాలక భయకంపితులై యేమియు చేయజాలక సత్యము చెప్పినను గ్రహింపక యలవాటువలన నసత్యమందభిమానము గలిగి పలవరించుచున్నవారు. మానవునియందు స్వభావజన్యమునకంటెను అభ్యాసజన్య మధికముగ

నున్నది. ఈశ్వరీయజ్ఞానము వీని చేతిలో నున్నది. ఈశ్వర శాసనబద్ధుఁడు. దాని నతిక్రమించినచో శిక్షకు పాత్రుఁడు. తప్పుచేసి దుఃఖమును నొప్పుచేసి సుఖమును పొందును. ప్రకృతి దైవనియమములను తెలియగలఁడు. గనుక మానవుఁడు సత్యాసత్య విమర్శనము చేయగలఁడు. వాఁడు విచారరూపమగు దీపమునుఁ బట్టుకొని, పరిశ్రమమను గుద్దలితో త్రవ్వి పాతాళమునఁ జేరిన సత్యరత్నమునుబైటికిఁదీసి ప్రకాశింపఁజేయఁగలఁడు ఇప్పుని మానవుఁడెట్టు లేయేవిషయములందుఁ జేయవలసియున్నదో దానిని వివరముగఁ దెల్పుట సమంజసము.

ఈశ్వరుఁడన నేమి? అతఁడున్నాఁడా! సాకారుఁడా నిరాకారుఁడా? అతని గుణకర్మ స్వభావములేమి; అతఁడవతారము లెత్తునా? జీవుఁడే దేవుఁడగునా? ఈశ్వరుని యుపాసించు టెట్లు? జీవునికి జన్మాంతరములున్నవా? మోక్షమననేమి? అదియనంతమా? సాంతమా? దేవుఁడు వేదమునిచ్చియున్నాఁడా? ఇచ్చియుండినచో దానిలక్షణములేమి? ఇత్యాదులీశ్వరీయములు. అందరు వేదాధికారులగుదురా? మతమతాంతరములెక్కడివి? పుట్టుకతో వర్ణమువచ్చునా? జాతియననేమి? వివాహవయస్సెంత? ధర్మమననేమి? విద్యయననేమి? వ్రత-తీర్థ-జప-తప-హోమాదులననేవి? మానవ జీవనోద్దేశమేమి? భక్ష్యాభక్ష్యములేమి! మాన

వుడు భవిష్యము చెప్పగలడా? గ్రహములు ఫలాఫలములిచ్చు నా? శ్రాద్ధముమృతులకా జీవితులకా? ఇత్యాదులు మానవీయములు పృథివిని సూర్యుడు ప్రదక్షిణముచేయునా? అథవా భూమి సూర్యునిచుట్టుట నిజమా? ఇత్యాదులు ప్రాకృతములు. వీనినెల్ల నిరూపించుటకే మేము వైదికాంధ్ర గ్రంథమాలికను ప్రచురింపఁబూని పనిచేయుచున్నారము. ప్రతివాడును సత్యమెఱుంగగోరుట, దానిని యాచరించుట, యని రెండువిధములు. అప్పుడు వాడు సత్యముయొక్క పరమావధిని జేరినవాడగును. సత్యపాలనాధికారము వానియందు పరిపూర్ణముగ నుండును. ఒక మిథ్యామార్గము మఱియొక మిథ్యకు హేతువగుచుండును. మిథ్యను ఖండించుటకు మఱియొకమిథ్య కావలసివచ్చును. దీనిని మిథ్యాథ్యవసతి యలంకారమందురు. అవశ్యముగ కర్మఫలమును భవించి తీరవలయునను సత్యవిశ్వాసముగల వాడెప్పుడును పాతకమునకు జడియుచుండును. ఈసత్యమునుండి జారిపడిపోయినవాడ కర్మసుకర్మముల భేదమునెంచడు. దేవుఁడు న్యాయకారి నిష్పక్షపాతియని తెలిసినప్పుడు, కర్మకుఁదగిన ఫలమునిచ్చునను విశ్వాసము కలుగును. దేవుఁడు దయాళువు గనుక మన పాపములు క్షమించునని మరియొకడు చెప్పినప్పుడు మొదటి విశ్వాసము చలింప ప్రారంభించును. అప్పుడు సత్యప్రియుఁడు, న్యాయము-దయ యీరెంటికిని భేదమేమని మీమాంసముచేయును. అట్టి

వానికి తప్పక సత్యము ప్రతీతమగును, అట్టివాని యాచరణము నకు భద్రమైన బునాదియేర్పడుట కెంతమాత్ర మభ్యంతర ముం డనేరదు. సత్యము వృథాచేష్టకానేరదు. కుంటివానిని కుంటివా డా! యనిపిలుచుట వృథాచేష్టయగు సత్యము. భ్రమాస్పద మైన యసత్యమును జాపి నిర్భ్రాంతముగ జేయుటయే సత్యపా లనము. ఇది గౌతమాదులు రచించిన షడ్దర్శనముల వలన లభిం చును. మన మొక విషయమును తప్పుగా తెలియుటకంటెను దాని నేమియు తెలియకుండుట మేలనవచ్చును. ఎందుకన తప్పుగా తెలియుటవలన గలిగెడు నష్టమునకంటె నేమియు దెలియకుండుటవలన గలిగెడు నష్టమల్పముగా నుండును. సత్య మును ఆచరించుటకు సదాచారమని పేరు. సత్యాచరణ దీక్షగల వారు సదాచారులగుదురు. సత్యాచారేణ దేవత్వం ఋషిత్వం చతద్దై వచ, ప్రాప్నువంతి కుయోనిత్వం మనుష్యాస్తు ద్విపర్య యే" సత్యము ననుకరించువారు దేవతలు ఋషులగుదురు. తద్విరుద్ధులగు మిథ్యాచరణముగలవారు హీనకులమందు జన్మిం తురు. ప్రతిమతములవారును తమ సిద్ధాంతములే సత్యములని చెప్పుచున్నారు. మీమంతవ్యము లెట్లు సత్యములైనవి? యని యడుగుట వినుచున్నారము. ఇట్లుతప్పక యడుగవలసినదే. ఇం దుకు సదుత్తర మిచ్చుటలోనే సత్యబలము గలదు. మేమును మీమతము లెట్లు సత్యములైనవి? యని అందరినియడిగి చూ

తము. మతమతాంతరులుత్తరములు మూడువిధముల నిత్తురు. 1. మాతండ్రితాతలు యీలాగు చెప్పుచూ వచ్చియున్నారు. 2. మామతగ్రంథములోనే - ఇవి సత్యసిద్ధాంతములని వ్రాయ బడియున్నది. 3. మామత ప్రవర్తకాచార్యు లిప్పుడును చెప్పు చున్నారు. మరల మనమువారినిట్లు ప్రశ్నించుచున్నాము:— మీతండ్రితాతలు భ్రమించియుండవచ్చును గదా? దానియదార్థ మును మీ రెట్లు నిర్ధరింతురు? మీమతగ్రంథములందు ప్రత్యక్షా నుమానాది యన్వీక్షికీవిద్యద్వారా విరుద్ధాంశములు ప్రతీతమై నప్పుడునయితము నవి సత్యములని నమ్మవలెనా? ఇందుకు మ తాంతరులిట్లు బదులుచెప్పుదురు. 1. మతధర్మముల విషయము లో శంకించవలసిన యావశ్యకములేదు. 2. మతాచారములలో తర్కప్రమాణముల ద్వారా యనుసంధానము చేయకూడదు. అట్లుచేయుట పాపము. అది పాపమని మాగ్రంథములు చాటు చున్నవి.. 3. మన పూర్వులునమ్మిన దానియందు మనము విశ్వాసముంచుట ధర్మము. ఈయుత్తరములు సంతృప్తికరములై యున్నవా? నితాంతముగ లేవు. ఏది యుక్తప్రత్యక్షాదులకు విరోధమో దానినినమ్ముట కేవలమజ్ఞానము. గనుక సత్యాసత్య వివేకముకొరకు గౌతమాది ఋషులు దర్శనములను రచియించి యున్నారు. ఇప్పుడెచ్చట జూచినను దర్శనములకు విరోధముగ వాదించు వారధికముగ నున్నారు. అట్టివారి కవకాశము లభింప

కుండ నుండుటకై మేము దర్శనపరిచయమును ప్రకటించుచు కొందరి వితండావాదములను జూపి లోకులు భ్రమింపకుండునట్లు చేయుచున్నారము.

(సంపాదకుఁడు.)

---

# న్యాయదర్శన పరిచయము.



సత్యాసత్య నిర్ణయమందు వ్యామోహము కలుగకయుండుటకై న్యాయదర్శనము గౌతమమహర్షివలన రచియింపఁబడినది. దీని ముఖ్యనియమములను పాఠకులకు నివేదించుట మాకర్తవ్యమని భావించినారము. న్యాయమన లోపల ప్రవేశించుట న్యాయాలయ మందొకఁడు, ప్రవేసించి రాముఁడనువాఁడు తనకు రంగడు నూరు రూప్యములు ఋణమియ్యవలయునని చెప్పుచున్నాఁడు. రంగఁడందులకు నేనియ్యవలసినది లేదనుచున్నాఁడు. న్యాయాధీశుఁడు ప్రమాణములను పుచ్చుకొని సాక్షులను విచారించి యనేక ప్రశ్నల మూలమున పరీక్షించి వ్యవహారమందలి మాటలలో ప్రవేశించి సత్యమును అసత్యమును వేఱుచేయుచు

న్నాను. అనగా న్యాయమనుటకు సత్యము తెలిసికొనుటయని యర్థము. అట్టు యథార్థమెఱుంగుటకుగల నియమములకు న్యాయవిద్యయని, న్యాయశాస్త్రమని, న్యాయదర్శనమని, తర్కమని, అన్వీక్షికియని, యుక్తి విద్యయని పేరు. ఇది సత్యాసత్యములను వేఱు వేఱు చేయుచున్నది. ఈ న్యాయవిద్య అన్నివిద్యల యొక్క ప్రదీపమని, సర్వకర్మలకు నుపాయమని, సకల ధర్మములకు ఆశ్రయమని చెప్పఁబడుచున్నది. మఱియు నీశాస్త్రము (1) మనమెట్లు భ్రమ ప్రమాదములనుండి దప్పించుకొనగలమో (2) మనమేవిధముచేత మన పొరబాటులను తెలిసికొనగలమో (3) మనమేరీతిగ పరుల భ్రమను పట్టుకొనగలమో (4) మన మేలాగున నితరులను సత్య మవలంబింపఁజేయగలమో (5) పరులు స్వార్థులై వ్యర్థమగు వాద వివాదము లెట్లుచేయుదురో? యిత్యాది యంశములను పూర్ణముగ వివరించుచున్నది. న్యాయవిద్య మనుష్య కల్పితముగానేరదు అది స్వతః సిద్ధము గణిత జోతిష విద్యవలన నభశ్చరములగు గ్రహగతులయొక్క నియమములను తెలిసికొని యీదినము గ్రహణము తటస్థమగునని చెప్పుచున్నారు. ఈ నియమము నెవరు కల్పించియున్నారు? ఈ నియమములను ప్రకాశపరుచుటకు జ్యోతిర్విద్యయను శాస్త్రమును మానవుడు రచియించెను. ఈప్రకారముగ న్యాయవిద్య తన నియమమువలన వస్తువుయొక్క వాస్తవమును తెలుపుచున్నది.-

జ్ఞాతచే తనజ్ఞాతముయొక్క తత్త్వమును కనిపెట్టుచున్నది. అసత్య మునుండి సత్యమును ప్రత్యేకముఁ జేయుచున్నది. ఈ నియమ ములను గౌతమముని సూత్రములుగ రచించెను. ఈసూత్రముల కు వాత్స్యాయన వాచస్పత్యాదులు భాష్యములను వానికి యనే క పండితులు తాత్పర్యములను వ్రాసియున్నారు. బిడ్డపుట్టినతో డనే చూచుటకు వినుటకు ప్రారంభించును తరువాత క్రమక్రమ ముగ ప్రత్యక్ష సంస్కార మభివృద్ధియై స్వానుభవమును స్మరించు కొనుచు తెలిసినదానివలన తెలియనిదానిని తెలిసికొనుచు తుద కు న్యాయానుసారముగ వాదవివాదమును ప్రారంభించుచున్నా ము. ఈలాగున సర్వసాధారణముగ ప్రతిమానవమాత్రుఁడును సర్వదా తనయొక్క వ్యవహారము లనేకములను న్యాయముచేత నే సాధింప ప్రయత్నించుచున్నాము. సారాంశమేమన ప్రతివారును కొంచెముగొప్ప యెవరును నేర్పకనే న్యాయనియమమును స్వభా వముగ తెలిసికొనుచున్నారు. అయినను పరిపూర్ణనియమముల ను తెలియవలయునన్న శాస్త్ర మావశ్యకము. శాస్త్రజ్ఞానము లేనియెడల పరిణామమందు దోషము సంభవించును. పదార్థము లయొక్క నిరీక్షణ పరీక్షణ నియమ నిర్ధారణలయందు పూర్ణజ్ఞా న మావశ్యకమై యున్నయది.

పరిభాష:—జ్ఞానము,విషయము-వ్యవహారము దేనినయి

నను తెలిసికొనుట జ్ఞానమనిపేరు. దేనిని తెలిసికొనుచున్నారమో అది విషయము అనఁబడును. పరులకు చూపించు దాని పేరు వ్యవహారమగుచున్నది. నేను నాయెదుట నొక పుస్తకమును జూపుచున్నాను. అట్లు చూచుటయు నొక జ్ఞానమేయగును. పుస్తకము విషయమగును. ఇప్పుడు దానిని యితరులకు చూపుచున్నాను అథవా నేను పుస్తకమును జూచుచున్నాను. యనుట వ్యవహారమగుచున్నది. జ్ఞానము, విషయము, వ్యవహారము యీమూటిలో జ్ఞానముయొక్క సవిస్తార నిరూపణము న్యాయదర్శనమునకు విషయమై యున్నది.

శబ్దశక్తి:—శబ్దమువలన నర్థప్రతీతి యగుచున్నది. శబ్దము అర్థమునకు సంకేతము. అర్థముగల శబ్దమే పదమనఁబడుచున్నది. ప్రతి శబ్దమును తనకు నియమితమైన యర్థమును చూపుచున్నది- ఇది శబ్దశక్తి యనఁబడుచున్నది. మొట్టమొదట శక్తిజ్ఞానము వ్యవహారమువలన గలుగుచున్నది. ఎట్లన నొక బాలుఁడు తన యింటియందొకరు మరియొకరితో "పాత్రను తీసికొనిరమ్ము" అని చెప్పగా పాత్రతీసుకొని రాబడుచున్నది. అప్పుడు బాలుఁడు పాత్రనుతెమ్ము అను పదముయొక్క అర్థజ్ఞానముగలవాడగుచున్నాడు. ఇట్లు వ్యవహారముచేత నారంభమై ప్రత్యేక శబ్దజ్ఞానము వృద్ధియగుచున్నది. శబ్దార్థసంబంధమునకు

వృత్తి యని పేరు. వృత్తి నాలుగు విధములు. శక్తివృత్తి, లక్షణావృత్తి, గౌణీవృత్తి, వ్యంజనావృత్తి యని. పుస్తక శబ్దమువలన పుస్తకపదార్థ ప్రతీతియగుటకు శక్తివృత్తి అథవాశక్యార్థమని పేరు. ఒకడు పుస్తకములకట్టపై నీరుపోయుచున్నాడు. అది చూచి యొకడు నాపుస్తకములు తడిసినవని చెప్పుచున్నాడు. పుస్తకశబ్దమువలన (పుస్తకముల) మూట ప్రతీతి యగుచున్నది. దీనికి లక్షణావృత్తి అథవాలక్ష్యవృత్తియని పేరు. లక్ష్యవృత్తి మూడు భేదములుగలది. జహల్లక్షణము, అజహల్లక్షణము, జహదజహల్లక్షణమని వీనినే క్రమముగా త్యాగలక్షణము, భాగలక్షణము, భాగత్యాగలక్షణమని చెప్పటకలదు.

జహల్లక్షణము:—"కాశీ గంగాతీరమునందున్నది" ఇచ్చట గంగాప్రవాహమగు శక్యార్థము విడువఁబడితీర ప్రతీతి యగుచున్నది. అర్థాత్ శక్యార్థముత్యజింపఁబడినది. అజహల్లక్షణము:—"పిల్లిచే పెరుగు రక్షింపఁబడవలెను" ఇచ్చట పిల్లియును శక్యార్థమేగాక కుక్క కాకి మొదలగువాని ప్రతీతిసయితము గలుగుచున్నది. గనుక శక్యార్థముతోగూడ అన్యాన్యశబ్దార్థ ప్రతీతిగలుగుటకు అజహల్లక్షణమని పేరు. జహదజ హల్లక్షణము:- పూర్ణముగ శక్యార్థముత్యజింపఁబడక యొక యంశము గ్రహింపబడుటకు జహదజహల్లక్షణమని పేరు. ఉదాహరణము:- "పుస్త

కము చినిగినది" పుస్తకమందొక పుటమున కొంచెము చినిగి పోయినను పుస్తకము చినిగిపోయినదని చెప్పబడుచున్నది. ఇచ్చట శక్యమల్పముగ స్వీకరింపబడినది. పూర్తిగ గ్రహింపఁబడను లేదు. వస్త్రములోనేభాగము కొంచెముకాలినను వస్త్రము కాలినదని చెప్పబడుచున్నది.

గౌణీవృత్తి:—ప్రసిద్ధబలముగల రామమూర్తిని భీముఁడని చెప్పుచున్నారము. ఒకమూర్ఖునిఁ జూచిసప్పుడు గాడిదె యనుచున్నారము. మన బ్రిటిషుప్రభుత్వమును రామరాజ్యమనెదము. ఇచ్చట శక్తిలక్షణాదులకు భిన్నమగు గుణము స్వీకరింపఁబడినది. దీనికి గౌణార్థమని పేరు.

వ్యంజనావృత్తి:—ఒక విద్యార్థి తన యుపాధ్యాయునితో "అయ్యా! ఐదుగంటలు కొట్టినది" అనుచున్నారు. ఇచ్చట "మేమింటికి పోయెదము" అను ప్రతీతి కలుగుచున్నది. ఉపహాసమం దీవృత్తి ప్రయోగింపఁ బడుచున్నది. శబ్దములు వాని విభజనాదులనుగూర్చి వ్యాకరణమునఁ జూచుకొనవలెను. ఇచట న్యాయదర్శన సంబంధమగు సంశయములే వివరింపఁబడుచున్నవి.

ధర్మ-ధర్మి:—మన యెదుట నొక పుష్పమున్నది. దానిని చూచుచున్నారము. దాని రంగునుజూచెదము. అది వాయువుచేత కదలుచున్నది. దాని నాఘ్రాణించి వాసనఁ జూచెదము

దానిని ముట్టినచో స్పర్శప్రతీతమగుచున్నది. నోటిలో వేసికొని నమలినప్పుడు రసప్రతీతి యగుచున్నది. ఇచ్చట పుష్పము ముఖ్యవస్తువు. ఈ ముఖ్యమగు పుష్పాధారమున రస, గంధ, స్పర్శ, చలనాదులు. ప్రతీత మగుచున్నవి. వీని యన్నింటికి నాధారమగు పుష్పము ధర్మి యనఁబడుచున్నది. రూపరసగంధాదులు ధర్మ మనఁబడుచున్నవి. ఈలాగుననే గుఱ్ఱము ధర్మియగును. దానిరంగు, సకిలింపు, నడక, మున్నగునవి ధర్మమగును. ద్రవ్యము-గుణము- కర్మ:—ముఖ్యవస్తువగు ధర్మి ద్రవ్యమనఁబడును. ఉపర్యుక్తమగు పుష్పము గుఱ్ఱము రెండును ద్రవ్యములు; వానియందు ప్రతీతమగు ధర్మములు గుణకర్మములగును. ద్రవ్యగుణకర్మల మూటికిని అర్థమని పేరు.

జాతి-వ్యక్తి:—మానవ, పశు, పక్షి, వృక్షాదులు జాతి యగును. నారాయణమూర్తి యిత్యాదులు వ్యక్తియగుదురు. మనుష్యశబ్దము జాతివాచకము, రామనాథశబ్దము వ్యక్తివాచకము. జాతికి సమానత ముఖ్యమైనది. దీనిని యెట్లు కనిపెట్టవచ్చును. గోవు, గుఱ్ఱము, గాడిదె, యిత్యాదులు వేఱువేఱు జాతులు. వీని యన్నింటికిని కాళ్ళు సమానముగ నున్నవి. ఈ యాధారమున నన్నింటికి పశుశబ్దము జాతివాచక మగుచున్నది. ఈలాగుననే కాకి, చిలుక, కొంగ, గ్రద్ద, హంసాదులు వేరుజాతులు. వానిలో రెక్కలు కాళ్ళు మున్నగు సమానత్వములను

బట్టి పక్షి శబ్దము యన్నింటికి చేరి జాతివాచక మగుచున్నది. ఇదేవిధముగ నన్నింటియందుగల వ్యాపక సమానతనుబట్టి వాడబడు జాతివాచకము "ప్రాణి" యగుచున్నది. ఇట్లే సమస్త వస్తువులందును కొంతవరకు సమత్వ ముండుటచేత "సత్" యను శబ్దము వాచక మగుచున్నది. పశువని చెప్పునప్పుడు నాలుగుపాదములుగల ప్రాణిసముదాయము గ్రహింపఁబడుచున్నది. మనుష్యుఁడని చెప్పినప్పుడు రెండుపాదములుగల ప్రాణి సమూహము గ్రహింపఁబడుచున్నది. రంగునుబట్టియు కర్మను బట్టియు చెప్పునప్పుడు పరంపరా సంబంధము వచ్చుచున్నది. నల్లని మేకలు, తెల్లని గుఱ్ఱములు బండిగుఱ్ఱములు యిత్యాదులగు పరంపరా సంబంధవాచకములు. న్యాయదర్శనమందు రెండు సంబంధములు మాత్రము పనికివచ్చును. మొదటిది సంయోగ సంబంధము, రెండవది సమవాయ సంబంధము. అనేక ద్రవ్యములు తమలో తాము కలసినయెడల సంయోగ సంబంధమగుచున్నది. గుణకర్మములు ద్రవ్యముతో సంబంధించినయెడల సమవాయ సంబంధ మగుచున్నది. సంయోగసంబంధము గల వాని యొక్కము రెండవదాని యాధారమును త్యజించి ప్రత్యేక మగుచుండును. సమవాయ సంబంధ మట్లుగాక పరస్పరముచేరి యుండును. కొన్ని పుస్తకము లొక్కటిగ చేర్చినప్పుడు సంయోగ సంబంధమగును గాని వానిని వేరుచేయుటకువీలుండును. తెల్ల

గుణ్ణమునుండి తెలుపురంగుగాను శ్వేతవర్ణమునుండి గుణ్ణము గాని వేఱుకానేరదు. ఇదేవిధమున గుణ్ణముయొక్క దౌడాయింపును గుణ్ణమునుండి ప్రత్యేకింపజేయ వలనుపడదు. అనేక తంతువులచే వస్త్రము నేయఁబడినది. ఇచ్చట తంతువులు అవయవములు గనుక సంయోగసంబంధ మగుచున్నది. అయినను తంతువులకు సంయోగసంబంధమగును గాని వస్త్రమునకుఁ గాదు. తంతువులు తమలో తాము ప్రత్యేకమగును గాని వస్త్రము తంతువులనుండి ప్రత్యేకముకాజాలదు. గనుక తంతువులు వస్త్రముతో సమవాయసంబంధము గలవియగును. ఇదే ప్రకారముగ జాతికి జాతి సమవాయసంబంధము శాస్త్రమందు చెప్పఁబడి యున్నది. ధర్మము సాధారణమని అసాధారణమని దర్శనశాస్త్రమందు రెండువిధములు. ఆవును బఱ్ఱెయు రెండును నెమరువేయును. ఇట్లు నెమరువేయుట నెమరువేయు పశువులకు సాధారణ ధర్మమగును. గోవునకు గంగడోలుగలదు. అంబా యను శబ్దము గలదు. ఇది గేదెయందుండదు గనుక గోవునం దిది యసాధారణ ధర్మముగా నున్నది. మరల నీయసాధారణ ధర్మము సమనియతమని యసమనియతమని రెండు విధములు. ఒక సముదాయమందు ప్రతివ్యక్తికి సదా కలిగియుండునది సమనియత మగుచున్నది. ఇందుకు వ్యతిరేకముగ నొకదానియం దుండుట మరియొకదానియందు లేకుండుటయు అసమనియత

మగుచున్నది. గంగడోలు ప్రతి గోజాతివ్యక్తియందును కలిగి యుండును. అంబాశబ్దము గోవులందు సదా(సర్వదా)యుండదు.

లక్షణము:—అవ్యాప్తి అతివ్యాప్తి అసంభవ దోషములులేనిది లక్షణము. అథవా శుద్ధలక్షణము. వాయువు రూపము గలదని చెప్పుట అసంభవ దోషమగుచున్నది. లక్షణము లక్ష్యమందు ఘటించినను యది దేనిచేతను తొలగింపఁబడక యుండవలెను. వాయువు జలబాష్పమును యెత్తికొనివచ్చి పర్వతములపై వర్షింపఁజేయుచున్నది. ఈలక్షణము వాయువునందు ఘటించినప్పటికిని వాయువంతటికిని యిట్లు ఘటింపదు. ఏవాయువు సముద్రమునుండి బాష్పమును తెచ్చుటలేదో అదియు వాయువు యగును. గనుక దీనికి అవ్యాప్తిదోషమని పేరు. వాయువునందు స్పర్శగుణము గలదు. వాయువునదంతటను గలదు. అయినను పృథివియందును గలదు. లక్ష్యమందేగాక అలక్ష్యమందును ఘటించుచున్నది. దీనికి అతివ్యాప్తి దోషమని పేరు. ఈదోషములులేనిది శుద్ధలక్షణమనఁబడుచున్నది. వాయువునందు రూపహీనమును స్పర్శమును గలవు. వాయువంతటను రూపహీనము గలదు. స్పర్శమును అలాగే వాయువంతటను గలదు. ఇందు అవ్యాప్తి అతివ్యాప్తి అసంభవదోషములు మూఁడునులేవు. గనుక శుద్ధలక్షణమగుచున్నది. అసాధారణధర్మము లక్షణమగుచున్నది. అసాధారణ ధర్మము అసమనియమితమై నప్పటికిని లక్ష

ణమగుచున్నది. ఎట్లనగా మనుష్యుఁడుమాట్లాడుచున్నను, నడుచుచున్నను సదా నడుచుచుండుటగానిమాటలాడు చుండుట నగాని లేదు. గాని యివి మనుష్యునియందు ఘటించును. మనుష్యుఁడుతప్ప మరేదియు నిటారుగాతలయెత్తి నడచుట భాషించుటలేదు. మనుష్యునియందు యీయోగ్యత సదాయుండును. లక్షణమెప్పుడును యోగ్యతచే గలుగుచున్నది. బాలుఁడుసయితము సమయమువచ్చినప్పుడు మాటలాడును. తలయెత్తితిరుగును. ఈయోగ్యతకు తుల్యమగుజంతువేదియులేదు. లక్షణములిచే నిశ్చయింపవలెను.

కార్యకారణములు:—క్రొత్తగ నుత్పన్నమగు వస్తువునకు కార్యమనిపేరు. కార్యమును కలిగించునది కారణమగును. ఎట్లన వస్త్రము కార్యము. వస్త్రమునుచేయు సాధనములు కారణము. వస్త్రము తంతువులవలన నేర్పడుచున్నది. సాలెవాడు నేయుచున్నాడు. వాడు మగ్గము మొదలగు సాధనములు లేకుండ వస్త్రములను నేయజాలడు. గనుక వస్త్రమునకు తంతువులు సాలెవాడు, మగ్గము మొదలగునవి యన్నియు కారణములగును. ఈకారణము సమవాయి, అసమవాయి, నిమిత్త, ఉపాదానాది భేదములు గలిగియున్నది. వస్త్రనిర్మాణమందు, తంతువులు, మగ్గము చాళికలు నేతగాడు యేమేమి పనులుచేసిరి? తంతువు

లు వస్త్రముయొక్క రూపమును ధరించెను. అవి వస్త్రమయ్యె ను. వస్త్రమను దేహమునకు తంతువు లంగములై యున్నవి. దేహము అంగములకు ప్రత్యేకము కానేరదు. వస్త్రము తంతువులకంటె భిన్నమైనది కాదు. అనఁగా— కారణమే కార్యరూప ధారణమగునప్పుడు సమవాయి కారణమనఁబడుచున్నది. ఘటమునకు మట్టియు, దధికిపాలును, మంచుగడ్డకు నీరును సమవాయి కారణములు. ఇచ్చట నొకసంగతిగలదు. తంతువులచేత వస్త్రము కలుగుటలో తంతువులకు పరస్పర మొకవిశేష సంయోగ మావశ్యకమైయున్నది. ఇట్టి సంయోగవిశేషము సయితము కారణమగును. ఈసంయోగవిశేషము అసమవాయి కారణమనఁబడుచున్నది. చక్రములయొక్క సంయోగవిశేషము గడియారమునకు అసమవాయి కారణమగుచున్నది వస్త్రమేర్పడుటలో తంతువుల సంయోగము స్వతఃసిద్ధముకాదు. అది యొకనివలన చేయఁబడుచున్నది. అట్లు చేయువాఁడు సాలెవాఁడు గనుక వాఁడు నిమిత్తకారణము. సాధనములకు కరణసామగ్రియనిపేరు. (1) కారణమున్నమాత్రమున కార్యమవశ్యమగునను నియమము లేదు. (2) కారణసామగ్రియు, వాని సంయోగముచేయువాఁడున్నప్పుడు కార్యమగును. (3) కారణము లేనప్పుడు కార్యము లేదు. (4) కార్యములేకున్నను కారణముండును. కార్యము, కారణము లేకుండ జరుగనేరదు.

అన్యథాసిద్ధి:—వస్త్రముయొక్క యుత్పత్తియందు ఆకాశము అన్యథా సిద్ధమగుచున్నది. ఆకాశము సర్వదా విద్యమానమై యున్నది. ఆకాశములేకుండ వస్త్రము సిద్ధముకానేరదు. అయినను వస్త్రము సిద్ధమగుటలో ఆకాశము అన్యథా సిద్ధమగుచున్నది.

## ప్రత్యక్ష ప్రకరణము.

ఇంద్రియార్థముల యొక్క సాక్షాత్ సంబంధమువలనఁ గలిగెడు జ్ఞానమునకు ప్రత్యక్షమని పేరు. నేత్ర శ్రోత్ర ఘ్రాణ రసనాత్వచ యీయైదును బాహ్యేంద్రియములు. మనస్సు అంతరింద్రియము. ఈయారింద్రియములకును ప్రత్యక్షమగు రూప, శబ్ద, గంధ, రస, స్పర్శ, సుఖ, దుఃఖాదులు ప్రత్యక్షము లగుచున్నయవి. జ్ఞాన, యిచ్ఛా, ద్వేష, ప్రయత్నములు సయితము మనస్సునకు సాక్షాత్ యగుచున్నవి. ఎట్లన:—"ఇదివృక్షము" దీనిలో వృక్షము ప్రత్యక్షము. "నేను వృక్షమును చూచుచున్నాను" ఇది వృక్షముయొక్క ప్రత్యక్షమునకు ప్రత్యక్షము. అర్థాత్ జ్ఞాన ప్రత్యక్షము. ఈలాగున "వినుచున్నాను, ఆఘ్రాణించుచున్నాను, సుఖమును అనుభవించుచున్నాను" ఇత్యాదిగా ప్రత్యక్షము నేత్రాదియింద్రియము లారును అనుభవముచేసి కొనుచున్నవి. "నేను తినగోరుచున్నాను. త్రాగఁగోరుచున్నాను.

చేయుచున్నాను. నడచుచున్నాను" ఇత్యాదిగ జ్ఞానయిచ్ఛా ద్వేష యత్నములును ప్రత్యక్షానుభవము లగుచున్నవి. సంఖ్య పర్వత, విభాగ, పరిమాణ, పృథక్త్వసంయోగ, అపరత్వ, ద్రవత్వములనెడు యుద్భూతరూపములు నేత్రములకు ప్రత్యక్షముగా నుండును. రూపమువలెనే స్పర్శ, రస, గంధశబ్దములును ఉద్భూత యనుద్భూతములుగ నుండును. కంటితో మనమన్నివిధము లగు రూపములను జూచుటలో రూపమును రూపముయొక్క జాతియు చేరియున్నవి గనుక నుద్భూతరూపమనుటలో ద్రవ్యములును చేరుచున్నవి. మనము గుఱ్ఱముయొక్క నలుపుమాత్రమును జూచెదము. నల్లని గుఱ్ఱమును జూచుచున్నారము. మఱియు నాలాగే సమానత విశేషతాదులను జూచుచున్నారము. ఇవ్వన్నియు నేత్రమునకు విషయములయి యున్నవి. నేత్రముతో చూడదగినదంతయు నేత్రమునకు విషయమగుచున్నది. మనకన్ను యేపదార్థమును చూచునో ఆపదార్థముపై వెలుతురు పడుచుండవలెను. వస్తువుపై ప్రకాశముపడని సమయమందు కన్ను యట్టివస్తువును చూడజాలదు. అర్థాత్ ప్రకాశమందుండని పదార్థము కంటికి ప్రత్యక్షము కానేరదు. మనము బైటపోయి ప్రకాశమందు నిలుచుండి లోపల యంధకారమందుండు వస్తువును జూచినయెడల ప్రత్యక్షము కానేరదు. ప్రకాశము వస్తువుపై పడవలయును. మనపైనికాదు. మనమంధకారమందు

నిలుచుండి బైటవెలుతురునందు పడియుండు వస్తువును చూడ గలము. ఇంతియగాక చూడవలసిన వస్తువున కడ్డముగ నేదైన పదార్థముండరాదు. ఒక ఘటములో దీపము వెలుగుచుండినను అనగా లోపల ప్రకాశమున్నను మనకంటికిని దానికి నడుమ పెంకుఅడ్డముగ నున్నది గనుక యగుపడదు. చూడవది మనకన్ను తనదృష్టియొక్క సీమను అర్థాత్ హద్దునుదాటి పోజాలదు. దూరవీక్షణముచేత సీమను వృద్ధిచేసినచో కన్ను చూడగలదు. ఇట్లే స్థూల సూక్ష్మములందును జరుగుచుండును. నేత్రదోషము గలిగియుండినప్పుడు దృష్టి భిన్నమగును. పదిమందిలో నొక నికి యింద్రియదోషము లుండునుగాని యందరికి నిటువంటి దోషముండదు. గనుక ప్రత్యక్షమునందు సిద్ధాంతమునకు హానిలేదు.

త్వక్కునకు స్పర్శము విషయము. ఇది, యేకదేశియముగాక లోపల వెలుపల శరీరమంతటను గలిగి సార్వదేశీయమై యుండును. శీతజలమును త్రాగుటవలన లోపల స్పర్శానుభవమగుచున్నది. ఉష్ణజలము త్రాగినచో లోపల యుష్ణప్రతీతమగుచున్నది. స్పర్శముయొక్క సమాసవిశేషములు నేత్రమునకువలెనే సంఖ్యా, సంయోగ, విభాగ, దూర, నికట, స్నేహ, ద్రవత్వ, పరిమాణ, సమవాయా కర్మాదులు త్వాచ ప్రత్యక్షములగును. శ్రోత్రమునకు ద్రవ్యము ప్రత్యక్షము కానేరదు. ధ్వని ప్రత్యక్ష

మగుచున్నది. శబ్దమునుబట్టి ద్రవ్యనిర్ణయ మగుచున్నది. ఘ్రాణమువలన సుగంధదుర్గంధాది గంధభేదములు ప్రత్యక్షమగుచున్నవి. నాలుకవలన తీపు చేదు మున్నగు రసప్రత్యక్షము గలుగుచున్నది. మనస్సువలన సుఖ దుఃఖములు ప్రత్యక్షమగుచున్నవి.

ప్రత్యక్షము నిర్వికల్పక సవికల్పకమని రెండు విధములు. మొదట నిర్వికల్పకము తరువాత సవికల్పకము ప్రతీతమగుచుండును. దూరమునుండి యొకవస్తువును చూచి యచ్చట నేమో కలదను చున్నారము. తరువాత దృష్టిని యేకత్రితముచేసి చూచి యది 'గోవు' యని చెప్పెదము. సమీపమందిట్టి నియమము లేదు చేత దండముగల మనుష్యుని జూచినప్పుడు, దండయుక్తుడని మొదట ప్రతీతి కలుగదు. దండము, పురుషుడు, అను వేరువేరు. జ్ఞానము గలిగినప్పుడు, దండయుక్తుడని ప్రతీతి యగుచున్నది. పురుషుడు విశేషము; దండము విశేషము; దండయుక్తుడు విశిష్టము సర్వత్ర యీలాగున గ్రహించవలయును.

అనుభవము-స్మృతి:—మనమొక వస్తును సాక్షాత్తుగా జూచుటకు అనుభవమని పేరు. మరల నావస్తువు మనయెదుట లేకున్నను దాని యాకారాదులు జ్ఞాపకమునకువచ్చుట స్మృతి యగుచున్నది. కంటితో చూచుట అనుభవము. అలాగుననే చెవి

తో వినుటయు నాసికతో వాసనను గ్రహించుటయు, నాలుక తో రుచి నెరుంగుటయు, ననుభవమగును. వీనిస్మరణము స్మృతి యగును. మనము దేనిని యనుభవము చేసికొనెదమో దాని సంస్కారము మన మానసమం దంకితమగుచున్నది. అట్లు మన స్సులో నంకితమైనది స్మృతికి వచ్చుచున్నది. ఈ సంస్కారము నకు భావనమని పేరు. ప్రశ్న: మొదటచూచుట తరువాత స్మ రించుట చాలియుండగా నడుమ భావనమను సంస్కారమును కల్పించుటెందుకు? ఉత్తరము:—స్మృతికి కారణము సంస్కారము గనుక ప్ర: స్మృతికి అనుభవమే కారణమగుచుండలేదా? ఉ: ని స్సందేహముగ ననుభవము కారణమైనను దానిచే సంస్కారము త్పన్నము కానియెడల కొంతకాలము గడచినచో అనుభవము నశించును. ఒకరు వ్యాఖ్యానము చేయుచున్నారు. అధవా సం గీతము పాడుచున్నారు. దానిని యొక తట్టపై తీయుచున్నారు. దానిపైని అంకితమైన గానమును వినగోరినప్పుడు దానిని శబ్ద గ్రాహి యంత్రమందుంచినచో మరల మనకు గానము వినబ డుచున్నది. ఈలాగుననే మనస్సను తట్టపై అనుభవమను చిహ్న మంకితమైయున్నను మరల నది సంస్కారమను యంత్రముచే ప్రకటన మగుచుండును. అభ్యాసాధిక్యము వలన సంస్కారము దృఢమగుచున్నది. ఇది జీవాత్మయొక్క ధ్యానము అను యం త్రమువలన స్మృతికి, వచ్చుచున్నది. స్మృతి, స్మారకము, ఉద్బో



ధకము యివి సమానార్థకములు.

నిర్వికల్పక ప్రత్యక్షముతప్ప తక్కిన జ్ఞానభేదములన్నియు స్మృతిపై నిర్భరమగుచున్నవి. ఒక బాలునకు మొట్టమొదట వస్తువుయొక్క నిర్వికల్పక జ్ఞానము గలుగుచున్నది. వాడు కన్నులతో రూపమును జూచుచున్నాడు. అప్పుడు వానికి యది దేని రూపమో తెలియదు. ధర్మధర్మిభేదము కానేరదు. స్పర్శమును నాలాగే యిది దేని స్పర్శమని యెరుంగడు. స్పర్శానుభవము మాత్రము కలుగును రెండవసారి చూచినప్పుడు అనుభవము స్మృతి రెండును మిళితమై రూపభేదముల నెఱుంగుచున్నాడు. మొదట తనతల్లిని యితర స్త్రీలను జూచును. తరువాత చూచినప్పుడు యితర స్త్రీలతో తన తల్లిని వేఱుపరచి తల్లినిగుర్తించును. పిమ్మట తల్లి స్వరమును విని తల్లియనుకొనుచున్నాడు. తల్లికి సమానమగు యాకారమును చూచి తల్లిని స్మరించుకొనుచున్నాడు. ఒకడు మృగ తృష్ణను (ఎండమావులను) చూచి జలమనుకొనెను. అది జలమును చూచియుండిన స్మృతియగుచున్నది. సంశయము సయితము స్మృతివలన గలుగుచున్నది. సామాన్య ధర్మమును జూచి నిశ్చయముగలుగును. సంశయమును తొలగించుటకు విశేష ధర్మముయొక్క స్మృతి గలుగుచున్నది. విశేష ధర్మమును చూచి నిశ్చయమగుచున్నది. ఈప్రకారముగ

నిర్వికల్పక ప్రత్యక్షము ముఖ్యానుభవముగ నున్నది. దాని సంస్కారమువలన స్మృతి యుత్పన్నమగుచున్నది. స్మృతియొక్క ఆధారముచేత జ్ఞానముయొక్క యనేక ప్రభేదములు గలుగుచున్నవి. గనుక అనుభవము స్మృతి రెండును జ్ఞానముయొక్క భేదములై వెలయుచున్నయవి.

అనుభవము: ప్రత్యక్షమని, పరోక్షమని రెండువిధములు. రూపమును చూచుట ప్రత్యక్షానుభవము. అనుమానము శబ్దాదులద్వారా తెలియుట పరోక్షానుభవము. ఈ యనుభవము యథార్థమని, అయథార్థమని రెండువిధములు. ప్రత్యక్షముగాని, పరోక్షముగాని సత్యానుభవమునకు యథార్థానుభవమనియు మిథ్యానుభవమునకు అయథార్థమనియు పేరు. త్రాడును త్రాడుగాచూచుట యథార్థము. త్రాడును పాముగా చూచుట అయథార్థము. ధూమమును జూచి యగ్నియని యనుమానించుట సత్యపరోక్షము. మంచును జూచి యగ్నిని యూహించుట యసత్యపరోక్షము. ఆప్తపురుషుడు చెప్పుటవలన గలిగెడు జ్ఞానము సత్యపరోక్షము. అనాప్తజనుడు చెప్పుటచే కలిగిన జ్ఞానము అసత్యపరోక్షము. ఈలాగున ప్రత్యక్షపరోక్షములు సత్యాసత్యములని రెండువిధములు. స్మృతిసయితము యదార్థములని రెండువిధములగును. స్మృతి యనుభవా

ధీనము గనుక యథార్థానుభవముచేత యథార్థస్మృతియును, అయథార్థానుభవముచేత మిథ్యాస్మృతియును గలుగుచున్నది. మఱియు అయథార్థానుభవము భ్రమ, సంశయములని రెండు భేదములు. త్రాడును పామని, తెలియుటకు భ్రమమనియు, నిటువలె రాత్రియందు రక్తవర్ణముగల వస్త్రమును నలుపువర్ణముగల వస్త్రమని తెలియుటకును భ్రమయనియుపేరు. అనఁగా నన్యవస్తువును యన్యవస్తువని తెలియుట. ఏదియో నొక నిశ్చయములేనిది సంశయమనఁ బడుచున్నది. అది త్రాడగునా? అథవా పామగునా? అది నలుపా? లేక తెలుపా? ఇత్యాదులన్నియు సంశయములగును. ఈసంశయము ప్రత్యక్షమునందును పరోక్షమందును గల్గును. పశ్చిమమందు మేఘములు లేవగా వానవచ్చునో? రాదో? యిది పరోక్షసంశయము.

సంభావనా:—ఇదియు నొక సంశయభేదము. ఎట్లనఁ నాతండ్రి యీదిన మిచ్చటికి రావలయును. అథవా ఈపని నెరవేరునని ముప్పాతికభాగము నమ్ముచున్నాను. ఇత్యాదులు సంభావనా సంశయమగును. ఏమిది? ఇతఁ డెటువంటి మనుష్యుఁడు? ఇది యెటువంటి పక్షి? అనధ్యవసాయ సంశయమగును.

స్వప్నము:— మనస్సునందు దిట్టి శక్తి యొకటి యేర్ప

డియున్నది. అవేదన ఏపనులను బాహ్యేంద్రియములుచేసి ముగించిన తరువాత వానిని మనస్సు యుద్బోధము చేయునో అవి మనస్సునకు ప్రత్యక్షమువలె భాసించుచుండును. ఈ కారణముచేత స్వప్నమందు నియమ రహితమైన దృశ్యములు మానసముయెదుట భావించుట సంభవించును. మానసయోగాభ్యాసముగలవారి కిది బాగుగ తెలియును. ఈయవస్థ బాహ్యేంద్రియములు తమ పనిని బొత్తిగా నాపివేసినప్పుడు కలుగుచున్నది. ఈ స్వప్నావస్థ జాగ్రత సుషుప్త్యవస్థలకు మధ్యస్థితియైయున్నది. సుషుప్తి యవస్థ యధికమైనప్పుడు స్వప్నము జ్ఞాపకముండదు. జాగ్రదవస్థ యధికమైనప్పుడు స్వప్నము జ్ఞాపకముండును. గాఢనిద్ర అర్థాత్ సుషుప్తియవస్థ తక్కువైనప్పుడు సంస్కారముయొక్క ప్రాబల్యముచేత మనస్సు స్వప్నానుభవమును పొందుచున్నది. అది భాసమాత్రముగాని విషయము కానేరదు. గనుక సప్న మానస విభ్రమము అథవా అయదార్థమగు ననుభవము. స్వప్నముయొక్క స్మరణకు స్వప్నాంతికమనిపేరు. జన్మాంధులకు స్వప్నములందు రూపములయొక్క దర్శనము కలుగదు. ఈహేతువువలన నది మానస సంస్కారమని చెప్పబడుచున్నది. మానసమహిమను వివరముగను విశేషముగను తెలియగోరువారు మాగ్రంథమాలికలోని తత్త్వజ్ఞానమను గ్రంథమును చూడవలయును. స్వప్నమందు మనుష్యు

నకు కొమ్ములున్నట్లు ప్రతీత మగుచున్నది. జాగ్రదవస్థలలో కొమ్ములుగల మనుష్యుని జూచియుండము. అయినను కొమ్ములను మనుష్యుని ప్రత్యేకముగఁ జూచియున్నారము. వాని సంస్కారము నియమరహితముగ ననుభవించుచుండుట స్వప్నమగును. అనేకమంది మనుష్యుల నొక్కపంక్తిగా నొక్కటేసారి చూచుటవలన గలిగెడు జ్ఞానమునకు సమూహాలంబన జ్ఞానమని పేరు. అనగా నొక్కదృష్టితో సమూహమునుచూచుట ప్రత్యక్షము దెప్పుడు యెట్లు ప్రమాదము కలుగును? న్యాయదర్శనముయొక్క ఫలము ప్రమాదమునుండి అర్థాత్ పొరపాటునుండి రక్షించుకొనుటయై యున్నది. పొరపాటు యెప్పుడు యెట్లు కలుగుచున్నదో తెలియు నిమిత్తము ప్రత్యక్షముయొక్క భేద ప్రభేదములు చూపఁబడుచున్నవి. ప్రమాదము నిర్వికల్పక ప్రత్యక్షమం దెప్పుడును కలుగదు. సవికల్పక ప్రత్యక్షమందే పొరపాటు కలుగుచుండును. సమీపమున నొక ముత్యపుచిప్ప పడియుండెను. దానిపై యొకనిదృష్టి పడుటవలన నొకవస్తువుమాత్ర జ్ఞానము (నిర్వికల్పముగ) కలిగెను. దానిని ముత్యపుచిప్పయని (సవికల్పముగ) తెలిసికొనెను. దానిని వెండి యని తెలిసికొనుట ప్రమాదమగుచున్నది. ఈపొరబాటు యెట్లు కలిగెను? ముత్యపుచిప్పయొక్కయు వెండియొక్కయు కాంతులు సమానమైయున్నవి. కొంచెము విశేషత్వమును కలిగియున్నవి.

ఇచ్చట యీ రెంటియొక్క సంస్కారము లుత్పన్నమైనందున సంశయము కలిగినది. ఇది ముత్యపుచిప్ప యగునా? అథవా వెండియగునా? యను సంశయము రెంటియొక్క స్మృతివలన గలిగినది. గనుక నప్పుడు ప్రత్యక్షము కలుగలేదు. సంశయము పోయినప్పుడు ప్రత్యక్షము కలుగును. చూచువాడు మిక్కిలి ధ్యానముతో సమీపించి కాంతియొక్క విశేషభేదమును చూచి యిది ముత్యపుచిప్పయని తెలిసికొనినప్పుడు సంశయము నివర్తి యగును. ఒకడు ముత్యపుచిప్పను చూచియుండడు. అట్టివాడు ముత్యపుచిప్పను చూచి వెండి యనుకొనుచున్నాడు. కారణ మేమి? వెండియొక్క సంస్కారము కలిగినది. ముత్యపుచిప్పయొక్క సంస్కారము కలుగలేదు. అయితే వెండియొక్క విశేషధర్మము తెలిసియుండలేదు. గనుక ప్రమాదవశుడైనాడు. సారాంశమేమన, విశేషదర్శనమువలన సంశయనివృత్తి యగుచున్నది. సంశయమును బాధజ్ఞానమని చెప్పుటకిలదు. సాధారణముగా సామాన్య ధర్మములను జూచినప్పుడు సంశయము కలుగుచు విశేషధర్మములను జూచినప్పుడు నివర్తి యగుచుండును.

నిర్వికల్పిక ప్రత్యక్షమునుండి సవికల్పికమెట్లు కల్గెడిదన మొదట నొకబాలునకు నిర్వికల్పక ప్రత్యక్షము కలిగెను. ఎట్లు కల్గెను? ఒకవస్తువును చూచెను. దానిని స్పర్శము చేసెను. అప్పు

డు రూపము స్పర్శము రెండు విలక్షణములు ప్రతీతమయ్యెను. ఇట్లు క్రమక్రమముగా నొక ధర్మియొక్క ధర్మమును దాని సంబంధమగు జ్ఞానమును ప్రతీతమగుచుండును. దీనికి సవికల్పకప్రత్యక్షమని పేరు. ఒక పదార్థముయొక్క రూపము చూడబడుచున్నది గాని దాని భారము తెలియుటకు కన్ను యోగ్యమై యుండలేదు. పదార్థమును చేతితో యెత్తిన తరువాత, భారము తెలియుచున్నది. ఈలాగున నిర్వికల్పకము సవికల్పక మగుచుండును. ఇంద్రియములు తమయొక్క స్వస్థమగు నవస్థయందు తమ సాక్షాత్ విషయములను తెలిసికొనుటయందు భ్రమను జెందవు. మనస్సుయొక్క సాక్షాత్ విషయము సుఖదుఃఖములను తెలిసికొనుటయైయున్నది. అది స్వస్థమగు స్థితియందు ప్రమాదమును బొందదు. గనుక ప్రత్యక్షమందేమియు దోషము లేదు. భ్రమమంతయు నింద్రియములయొక్కయు సంస్కారముయొక్కయు దోషముగా నుండును. ఒకడు సున్నమును చూచి యది తెలుపుగా నుండుటకు బదులు పసుపుగానుండినచో తన దృష్టియందు దోషముగలదని నిశ్చయించును. ఒకడు మిరపకాయను నమలి కారములేకుండ నుండెనేని తనకు జిహ్వాయందేమియో దోషమున్న దనుకొనును. సంశయరాహిత్యమైనది నిశ్చయాత్మక జ్ఞానమనంబడుచున్నది. సంశయము కలిగిన తరువాత నొక నిశ్చయమును చేయగల జ్ఞానము కలుగుచున్నది.

దానికి నిర్ణయమని పేరు. దూరమునుండి యొకనినిజూచి యతఁడు రాముఁడా? అథవా రంగడా? యను సంశయము మొదట కలుగుచున్నది. తరువాత రామునియొక్కగాని రంగనియొక్కయు విశేషధర్మములలో నేదిగాదో ధ్యానపూర్వకముగ తెలిసికొని నిర్ణయము చేయుచున్నారు. నిర్ణయమందు నొకకోటియొక్క ఖండనముండును. నిశ్చయమందట్టి ఖండనములేదు. రెంటిలో నేదియని నిర్ణయముచేయునప్పుడొకదానిని ఖండించవలసియుండును. ప్రమాప్రమలు:—యథార్థ అనుభవమునకు ప్రమాయనియు, అయథార్థమగు ననుభవమునకు అప్రమాయనియు, పేరులు. ప్రమాయొక్క సాధనమునకు ప్రమాణమని పేరు. ఒకడు వెళ్లుచుండి పామును జూచుచున్నాడు. అట్టి సర్పజ్ఞానమునకు ప్రమాయనిపేరు. వాడు దానినుండి తొలగిపోవుచున్నాడు. అథవా దానిని చంపదలంచుచున్నాడు. ఈప్రయత్నమునకు హీనబుద్ధియని పేరు. ఒకపుష్పమును జూచి దానిని స్వీకరించుచున్నాడు. దానికి ఉపాదానబుద్ధియని పేరు. నడచుచు ననేకవస్తువులను జూచుచు వానియందుపేక్షతో వెళ్లుచున్నాడు. ఇదియే యుపేక్షాబుద్ధి.

సంవాదీ, విసంవాదీ:—ఒక గ్రంథమందు సూర్యునిచుట్టు భూమి తిరుగుచున్నదని వ్రాయబడినది. ఇంకవలె ననేక గ్రంథములందున్న యెడల దాని కంగీకారము సంవాదీ ప్రమాణమని

యు, నిందుకు విరుద్ధముగ వ్రాయబడిన దంతయు విసంవాది ప్రమాణమనియు పేరు. ప్రమాణములలో ప్రత్యక్షము శ్రేష్ఠము యినది. ఒకడు "నేను యీ ప్రకారముగ వినియున్నాను" అను చున్నాడు. రెండవవాడు "నేను ప్రత్యక్షముగ జూచియున్నాను" అని చెప్పుచున్నాడు. "రాముడు నిన్నటిదినము మిక్కిలి దుఃఖముగా నుండియుండ వచ్చును" అని యొకడు చెప్పుచున్నాడు. రెండవ వాడు "రాముడు నిన్నటి దినమంతయు నాతోకూడ సుఖసంతోషములతో నుండెను" అని యనుచున్నాడు. రెండవ వాని యందు విషయము ప్రత్యక్షము. మొదటివాని మాటయందు విషయము అనుమానము. ప్రత్యక్షముయొక్క యాధారమువలన నుత్పన్నమగు ననుమానము సయితము సాక్షాత్ అనుభవముతో తుల్యము. స్పంజి, నీటిని యాకర్షించుచున్నది. ఇది ప్రత్యక్షముయొక్క యాధారమున కలిగిన యంశము.

ప్రవృత్తి:—ఇది సఫలప్రవృత్తి, నిష్ఫలప్రవృత్తి యని రెండువిధములు. నీటిని నీరని గ్రహించి త్రాగుటకువెళ్ళుట సఫలప్రవృత్తి యగుచున్నది. మృగతృష్ణమును జూచి జలమనుకొని వెళ్ళుట నిష్ఫలప్రవృత్తి యగుచున్నది. భ్రమసయితము సంవాదీ విసంవాదీయను భేదములు గలదిగా నున్నది. ముత్యపుచిప్పను జూచి వెండియని భ్రమించి సమీపించిపోయెను. అది ముత్యపు

చిప్పయని తెలిసికొనెనుగాని దగ్గరనే వెండియు లభించెను. దీనికి సంవాదియనిపేరు., వెండి లభించకపోయినవి సంవాదియనబడును.

అనుమాన ప్రకరణము:—అనుమానము తెలిసినదాని ననుసరించి, తెలియనిదాని నూహించుటవలన నేర్పడుచున్న యది. పొగను చూచి యచ్చట యగ్ని కలదనుచున్నాము. ప్రతివారును ప్రతిదినమును యనేక విషయములను యనుమానముచేతఁ దెలిసికొనుచున్నవారు. అయినను కొన్ని పొరపాటులు గలుగుచుండును. ఇప్పుడు పండ్రెండు గంటలు కాలమని యూహించిన నది గడియారము చూచినప్పు డొక్కగంటగా నుండ వచ్చును. ఈప్రకారము కొన్ని యనుమానములు మిథ్యలగు చుండుట చూచుచున్నాము. ఈవిషయమున సత్యాన్వేషకు లగువారు మూడుమాటలయందు ధ్యాస ముంచవలెను. సాధ్య, సాధన, సంబంధములు. ధూమమువలన నగ్నిని సిద్ధము చేయు నప్పుడు అగ్ని సాధ్యము, ధూమము సాధనము. ఈ రెంటికి చేరి నది సంబంధము. అక్కడ పిల్లియున్నది గనుక యవశ్యముగ నక్కడ యగ్నియుండవలెననుట అసంబంధము. వంటవానిని యడిగి యగ్ని తెమ్మనుట సంబంధము. ఈసంబంధమునకు వ్యాప్తియని పేరు. దీనిని మరచిపోయినయెడల సత్యాసత్యమందు బాధకము కలుగును. పొగకును అగ్నికిని కేవల సంబంధము

కలదు. అలాగుననే అగ్నికిని యుష్ణమునకును స్పర్శమునకును కాంతి అథవా తేజస్సునకును సంబంధము కలదు. గాని దేనివలన దేనిని సిద్ధముచేయుబడుచున్న దానికి సంబంధమును గమనించవలెను.

వ్యాప్తి-వ్యాప్య-వ్యాపకములు:—సాధనమునకు వ్యాప్యమనియు, సాధ్యమునకు వ్యాపకమనియు, పేరు. ధూమము వ్యాప్యము; అగ్ని వ్యాపకము. వీటిరెంటికి సంబంధము వ్యాప్తియగుచున్నది. వ్యాప్తి రెండువిధములు. సమవ్యాప్తి విషమ వ్యాప్తి యని, గంధము లేకుండ పృథివియు పృథివిలేకుండ గంధముండదు. ఇట్టి సమవ్యాప్తియందు పరస్పరము రెండును సాధ్య సాధనములగుచున్నవి. అగ్ని లేకుండ పొగయుండదు. ధూమము లేకుండ యగ్నియుండును. ఇట్టివిషమ వ్యాప్య వ్యాపకములో పరస్పర సాధ్యసాధనములు కానేరవు.

స్వార్థపరార్థానుమానములు:—అనుమానమందు నిశ్చయముండుట స్వార్థము. అనుమానముద్వారా పరులకు తెలియ జేయుట పరార్థము. "మనుష్యుడు చనిపోవువాడు" ఇత్యాదులు, నిశ్చయమని చెప్పుటకు ప్రతిజ్ఞయని పేరు. కార్యమువలన కారణమును యూహించుటకు "ఎచ్చట ధూమముండునో అచ్చట యగ్నియుండును" అను వాక్యము చెప్పబడును. దీనివల

న వ్యాప్తి నిశ్చయమగును. "ఆగోతిలో ధూమముకలదు గనుక నచ్చట యగ్నికలదు" ఇచ్చట ధూమము హేతువు. ఈ హేతువలన అగ్ని సిద్ధమగుచున్నది. ఇత్యాదిగ నూహించవలెను. అనుమానము:—పూర్వవత్ - సామాన్యతోదృష్ట - శేషవత్, అని మూడువిధములు. ధూమమున్నచోట యగ్నియుండునని మొదట యనుభవమై యుండును గనుక ధూమమున్నచోట అగ్ని కలదనుట మొదటిది. చంద్రునిపై భూమియొక్క ఛాయ గోళాకారముగ పడుచున్నది. గనుక భూమి గోళముగనున్నదనుట రెండవది. సాధారణ చిహ్నముచేత యనేకములగు స్మరణములు వచ్చును. వానిని యొకటి యొకటిగ తొలగించి శేషమును అనుమానించుట మూడవది. ఒక్క వైద్యుడు రోగిని పరిక్షించుటలో ననేక రోగలక్షణములను కనిపెట్టి వానిని తొలగించుచు విశేలక్షణములనుబట్టి చికిత్సచేయును. ఒక నదిలోని నీటిని వాని వృద్ధిని శబ్దమును తెలిసికొని వర్షము నూహించుట అర్థాత్ యొక యనుమానమందు మఱియొక యనుమాన మూహించుటకు, అనుమితానుమానమనిపేరు. వ్యాప్తి యనునది అన్వయవ్యాప్తియని వ్యతిరేక వ్యాప్తియని రెండుప్రకారములు గలది. ఎచ్చటెచ్చట ధూమముగలదో అచ్చటచ్చట అగ్నిగలదు. యెచ్చట హేతువుండునో అచ్చటసాధ్యముండుటకు అన్వయవ్యాప్తి యనిపేరు. ఎచ్చటయగ్నిలేదో అచ్చట ధూమ

ముండను. సాధ్య హేతువుల వ్యభిచారభావమునకు వ్యతిరేకవ్యాప్తియని పేరు.

పరులతో విచారము చేయుటకు కథాయని పేరు. ఈ కథ వాద వివాదమని రెండుభేదములు. ఈవాద వివాద రూపమగు కథకు సత్యనిర్ణయము పరమావధి. అర్థాత్ అభిప్రేతము. ఇందుకు జయాపజయములు అభిప్రేతమై యుండకూడదు. వాద వివాదము గురుశిష్యులకును సత్యప్రియులగు జిజ్ఞాసువులకును, జరుగవలయును. పరులను జయించవలె నను ముఖ్యోద్దేశముతో వాదించుటకు జల్పము మఱియు వితండావాదము అథవా కువాదమని పేరు. ఈ సందర్భములో ప్రతివాది సత్యమును గ్రహించుటకుమారుగా ఛలబలములతో స్వార్థమును సిద్ధింపజేసికొనఁగోరుచుండును. న్యాయ నిర్ణయమును జేయువారికి నైయాయికులనియు, జయింపగోరువారికి వితండావాదులనియు పేరు. సత్యాసత్య నిర్ణయము చేయుటయే నైయాయికుల కర్తవ్యము. వైతండికులు ధర్మాధర్మ విచారము విడిచి వివాదము చేయుదురు. అట్టివారితో వాదించునప్పుడు సిద్ధాంతము శ్రోతల యభిప్రాయమందుంచవలయును. మనువు యిట్టివారితో వాదించకూడదని విధించియున్నాడు.

హేతువిరుద్ధము:—"ఆత్మ నిత్యుఁడు. ఎందుకన నతఁ

దుత్పత్తియైనవాడు పృథివి అనాది. ఏలనన నది సావయవమై యున్నది" ఈవాక్యములు హేతువిరోధములు. ఉత్పత్తి నిత్యమునకు విరోధము. సావయవము అనాదిత్వమునకు విరుద్ధము.

హేత్వాభాసము:—"ఎవరెంత ప్రయత్నము చేసినను తొలగక విగ్రహారాధనము జరుగుచున్నది గాన నిది ఈశ్వరోద్దేశము" ఇది హేత్వాభాసము. ఈహేతువు దుష్టకార్యములగు జార చోరత్వములకును చెప్పవచ్చును గనుక హేత్వాభాసమగుచున్నది.

హేతుసందిగ్ధము:—"అచ్చట ధూమము వెళ్ళుచున్నట్లున్నది. గనుక నచ్చట యగ్ని కలదు" ఇచ్చట ధూమముయొక్క నిశ్చయము లేదు. సందిగ్ధమైయున్నది.

హేత్వాసిద్ధి:—"ఆత్మ యుత్పత్తియగుచున్నది. గనుక వినాశమగును" అనుటలో నుత్పత్తి సిద్ధము చేయఁబడలేదు. పృథ్వి గోళాకారమై యున్నది యని చెప్పినను, దానికి హేతువగు పృథ్వియొక్కఛాయ గోళాకారమని సిద్ధమగువరకు హేతువు అసిద్ధిగానేయుండును. అనఁగా కారణము నిజమైనదైనను, అది సిద్ధమగువరకు హేత్వాసిద్ధి యగుచుండును.

అప్రయోజకహేతువు:— "పరమాణువు గోళాకారమై

నందున వినాశమగును'' ఈ వాక్యమందు సాధ్యమునకు సత్య సంబంధము లేదు. గనుకనిది యప్రయోజక హేతువగుచున్నది.

వ్యభిచార హేతువు:— కొమ్ములు గలవు గనుక నిది గోవు అనబడును'' కొమ్ములనేక పశువులకు గలవు గాన నిది వ్యభిచార హేతువగుచున్నది. ఇతడు మార్వాడి గనుక ధనికుడుగా నున్నాడు. ఇతడు రాజపుత్రుడు గనుక శూరవీరుడు. ఇత్యాదులు వ్యభిచారహేతువులు. ఒక స్త్రీ విద్యనేర్చి అర్థాత్ వ్రాత చదువునేర్చి కామాభిలాషియై యొక పురుషునకు జాబు వ్రాయుచున్నది. ఇట్టి యుదాహరణమును జూపుచు స్త్రీలకు విద్య కూడదని యొకడువాదించుచున్నాడు. ఇందువలన సాధ్య సిద్ధి కానేరదు. ఎందుకన విద్యావతులగు స్త్రీలనేకులు పతివ్రతలై యున్నారు. ఇట్టి హేతువులన్నియు వ్యభిచార హేతువులుగా నున్నవి.

విషయాంతర హేతువు:—ఒక బ్రాహ్మణుడు పంచములు కల్లుద్రాగుట దోషమని చెప్పుచున్నాడు. దానికి ప్రత్యుత్తరముగ పంచముడు బ్రాహ్మణులు కొందరు చేపలను దినుచున్నారని యాక్షేపించుచున్నాడు. వాదము మద్యపానమును గురించి వదియై యున్నప్పుడు, దానిని విడిచి యిట్లు చెప్పుట విషయాంతర హేతువుగ నుండును.

శబ్దప్రమాణము:— ఇది స్వతఃప్రమాణమని, పరతఃప్రమాణమని, యుపమానమని, అర్థాపత్తి, అనుపలబ్ధి యని యైదు విధములు. వేదము స్వతఃప్రమాణము; వేదానుకూలమైనది పరతఃప్రమాణము. సాదృశ్యజ్ఞానమువలన అజ్ఞాతవస్తుజ్ఞానము గలిగించునది ఉపమానప్రమాణము. ఒకవాక్యము చెప్పుటచేత రెండవవాక్యమందలి యర్థము సిద్ధమగుట అర్థాపత్తిప్రమాణము. దేనివలన అభావజ్ఞానము కలుగునో యది అనుపలబ్ధిప్రమాణము. అభావము, అన్యోన్యాభావమని, సంసర్గాభావమని రెండు భేదములు గలది. "గోవు గుఱ్ఱము కానేరదు" ఇట్టి అభావమునకు అన్యోన్యాభావమని పేరు. ఈవాక్యములో గుఱ్ఱము గోవు కానేరదను భావము సయితము కలదు. "ఇచ్చట రాముడు లేడు అథవా రాముడు చనిపోయినాడు." ఇది సంసర్గాభావము. సంసర్గాభావము మరల ప్రాగభావమని, ప్రధ్వంసాభావమని, సామయికాభావమని, అత్యంతాభావమని నాల్గు భేదములు కలది. వస్త్ర మెంతవరకు నేయబడలేదో అంతవరకు ప్రాగభావము. ఒకవస్తువు నష్టమైపోవుచున్నది. అది విద్యమానమందులేదు. దానికి ప్రధ్వంసాభావమని పేరు. వస్త్రము కాలిపోయినది గనుక నిది ప్రధ్వంసాభావము. "వస్త్రము యిప్పుడిక్కడ లేదు" ఇది సామయికాభావము. వాయువునందు రూపము, అగ్నియందు భారము లేదు గనుక నిది యత్యం

తాభావము. సంభవప్రమాణము అధికపరిమాణమువలన అల్ప పరిమాణము సిద్ధించుటకు అర్థాత్ యొకఁడు కోటీశ్వరుఁడుగనో లక్షాధికారిగనో నున్నాఁడు. అనుటలో కోటిసంఖ్యయందు లక్ష సంఖ్యకలదు. ఇది సంభవప్రమాణము.

ఐతిహ్యప్రమాణము:—“కలకత్తానగరముయొక్క పూర్వనామము కాళిఘట్టము” చరిత్రాంశముతో సంబంధమైనది. ఐతిహాసిక ప్రమాణము దోషములు:—పూర్వాపరవిరోధము, స్వోక్తివ్యాఘాతము, కృతహాని, అకృతాభాగ్యమము, అనర్థము, అసంభవము, అయుక్తము, కుతర్కము, అభావనము, ప్రకరణ విరుద్ధము, అధర్మము, సృష్టిక్రమవిరుద్ధము, వేదవిరోధము, హేతువిరోధము, హాఠము మొదలగునవి దోషములు. ఒక గ్రంథమందొకచోట మాంసభక్షణ మనుచితమని చెప్పి యదేగ్రంథమందు మఱియొకచోట మాంసభక్షణ ముచితమని చెప్పిన దో పూర్వాపరవిరోధమగును. “ఈయవుషధము తినుటవలన నీకాకలికానేరదు. ఇందుకు పథ్యము చారును అన్నమును తినుచుండుము; ఇత్యాదివాక్యములు స్వోక్తివ్యాఘాతమగును” అజామిళుఁడు తన పుత్రుని నారాయణా! యని పిలుచుటవలన వైకుంఠమున కేగెను” అజామిళుఁడు మహాపాపి వానిపాపమునకు తగిన శిక్ష లభించలేదు. మఱియు సత్కర్మపరుఁడు కాకున్నను మో

క్షము లభించెను ఇందులో కృతహాని, అకృతాభ్యాగమ ము గలవు. ఒకరుగీతలోని "పత్రం పుష్పం ఫలంతోయో మే భక్త్యా ప్రయచ్ఛతి యను శ్లోకమును చెప్పి విగ్రహారాధన ముచితమని వాదించెదరు. కృష్ణుఁడు తన శిష్యుఁడగు అర్జునునకు తాను బ్రతికియుండగా గురువగు తనకు సమర్పించుమని చెప్పి యున్నాఁడు. సమర్పించగా స్వీకరింప గలఁడు. గాని, తాను చనిపోయిన తరువాత తన విగ్రహామునకు సమర్పించుమని చెప్పియుండలేదు. స్వీకార మసంభవము. ఇందు సత్యమునకు భంగము కలిగినది. గనుక అనర్థము. లేనియర్థ మును చెప్పుట అస్థదోషము గుఱ్ఱము రెండుగ్రుడ్లనుపెట్టినది. అం దొకటి యాడగ్రుడ్డు, మఱియొకటి మొగగ్రుడ్డు, ఇట్టివాక్య ము లసంభవములు, యుక్తికి విరోధమైనది అయుక్తము. జ్ఞాన ము సుఖహేతువు, అజ్ఞానముదుఃఖహేతువనుటకు విరోధముగ నిట్లుచెప్పుచున్నాఁడు. "ఒకయింటపామున్నదను జ్ఞానముగలవాఁడు సుఖముగ నిద్రచేయఁడు. పామున్నదను జ్ఞానములేనివాఁడుసుఖము గ నిద్రించును. గనుక అజ్ఞానమే సుఖహేతువని చెప్పుచున్నాఁడు ఇట్టిదికుతర్కము. ఎద్దులబండినిరైలుగాభావించుట విగ్రహామును ఈశ్వరునిగ భావించుట, యిత్యాదులు అభావసమగును. భోజనసమయమందు సైంధవమును తెమ్మన గుఱ్ఱమునుతెచ్చుట యి త్యాదులు ప్రకరణవిరుద్ధములు. దొంగలు పరులద్రవ్యమునుదొం

గలించుట ధర్మమనుకొందురుగాని తమద్రవ్యమును పరులుఅపహ రింట ధర్మమనితలంపక యధర్మమందురు. ఇత్యాదులుఅధర్మము లు. ధర్మముసార్వదేశీయముగనుక, తద్విరోధముఅధర్మము. పురు షసంపర్కములేకనే కన్యగర్భమందుక్రీస్తుజనించెను. ఇత్యాదులుసృ ష్టిక్రమవిరుద్ధము సృష్టిక్రమనుందు ఈశ్వరక్రమముంనునట్లు చెప్పు ట సృష్టిక్రమ విరుద్ధమగును. వేదమునకు విరుద్ధమైనది వేదవిరో ధము వ్యతిరేకమగు హేతువునుచెప్పుట హేతువిరోధము. ఒకరి విరోధముగను వ్యతిరేకముగను ధర్మాధర్మ వివేచనచేయకుండ గను, మాటలాడుట చేయుట మొదలగు గుణములు హారము. ఒకరికి వ్యతిరేకముగ ప్రవర్తించుటయే తమధర్మ మనుకొనుటకు హారమనిపేరు. సిద్ధాంతలక్షణములకు విరోధముగా నుండునవి దోషములనబడును. బంగారుయొక్క లక్షణములు తెలిసికొన్న వాడు తద్దోషముల నెఱుంగగలడు. గనుక దర్శనకారులు సూత్ర ములద్వారా సిద్ధాంత లక్షణములను వివరించియున్నవారు. ఉ దాహరణము:—వేదము స్వతః ప్రమాణమనుటకు "నపౌరుషే యత్వం తత్కర్తుః పురుషస్యా భావాత్" సాంఖ్య॥ 2 పూర్వే షామపిగురుః కాలేనాన వచ్ఛేదాత్॥ యోగ॥ 3 తద్వచనాదా మ్నాయస్యంప్రామాణ్యం॥ వైశేషిక॥ 4 శాస్త్రయోనిత్వాత్॥ బ్ర॥ సూ॥ (వేదాంత)॥ 5 మంత్రాయుర్వేద ప్రామాణ్య వచ్చత త్ప్రామాణ్య మాప్తప్రామాణ్యం॥ న్యాయ॥ 6 నిజశక్త్యభివ్య

క్తేః స్వతః ప్రామాణ్యమ్॥ ఇత్యాదిగ వివరించియున్నారు.

ఈశ్వరలక్షణము:—ఈశ్వరుఁడజరుఁడు, అమరుఁడు, నిర్వి కారుఁడు, సర్వవ్యాపి, శుద్ధబుద్ధముక్తుఁడు, సచ్చిదానంద స్వరూపుఁడు, న్యాయకారి, దయాళువు, నిష్పక్షపాతి, సర్వాధారుఁడు, సర్వజ్ఞుఁడు, సర్వశక్తిమంతుఁడు, నిరాకారుఁడు, స్వతంత్రుఁడు, అనాది.

ప్రశ్న:—న్యాయముగలవానియొద్ద దయాళుగుణ మెట్లుండును? తప్పుక్షమియించువాఁడు దయగలవాఁడు. క్షమించు వానియందు న్యాయమెక్కడిది? ఉత్తరము:—నేరముచేసినవాఁడు చక్కబడవలయునను దయచేతనే, అధికారి శిక్షించుచున్నాఁడు. శుభము కొఱకే బట్టనుతుకుట. ఈశ్వరు నిరూపణమందు పర్యుక్తలక్షణములకు విరోధముండకూడదు.

జీవలక్షణము:—జన్మమరణ సుఖ దుఃఖాది క్లేశ సహితుఁడు, సచ్చిత్ స్వరూపుఁడు, మితజ్ఞుఁడు, ఏకదేశీయుఁడు, కర్మ చేయుటయందు స్వతంత్రుఁడు, దానిఫల మనుభవించుటయందు పరతంత్రుఁడు, అర్థాత్ ఈశ్వరాధీనుఁడు, అనాది. జీవుఁడీశ్వరాంశుండనుట దర్శన విరోధము.

ప్రకృతిలక్షణము:—స్థూలసూక్ష్మ రూపములుగలిగి మార్పుచెందునది, జీవులకు భోగసాధనమైనది. చిత్ స్వరూపముగల

ది. అనాది. ప్రకృతిని శూన్యమని చెప్పుట దార్శనిక విరోధము. ధర్మ, వైరాగ్య, ఐశ్వర్య, అధర్మ, అజ్ఞాన, అవైరాగ్య, అనైశ్వర్య, యీగుణములేమను, జీవునకు బంధహేతువులగు ప్రకృతికములు.

త్రిగుణలక్షణములు:—దుఃఖ, శోక, ద్వేష, యీర్ష్యా నిందాదిగుణములు రాజసము. మోహ, భయ, వంచన, నాస్తికత, కుటిలత, యజ్ఞానాదులు తామసము. ప్రసన్నత, సంతోష, శ్రద్ధా, దయా, క్షమా, సుఖ, జ్ఞానాదులు సాత్వికము. (దేవుం డొకడు జీవులనేకులు) సాంఖ్య॥ ప్ర॥ 149 సూ. జీవాత్మకు ఇంద్ర, పురుషాది నామములు కలవు. వాని కర్మసాధనములకు నింద్రియములని పేరు.

అవివేకలక్షణము:—ఇది అవిద్య, అస్మితా, రాగ, ద్వేష, అభినివేశ, మను యయిదు భేదములు. అవివేక, విపర్యయ, మిథ్యాజ్ఞానములు పర్యాయ పదములు.

సృష్టిలక్షణము:—ఈశ్వరక్రమము సృష్టిక్రమమని రెండు విధములు. ఈశ్వరక్రమమునకు అమైథున సృష్టియని నామాంతములు. ఈశ్వరక్రమమందు సృష్టిక్రమమును, సృష్టిక్రమమందు ఈశ్వరక్రమమునుండదు. గనుక మా యాచార్యులు గుమ్మడికాయలో జన్మించిరని, మాగురువులు పుష్పములో నుద్భవించిరని,

యిత్యాది యమైథునసృష్టి మైథున సృష్టిలో చెప్పుట సిద్ధాంత ముకాదు. ప్రకృతియొక్క గుణదోషముల నెఱుంగుటకు తత్వజ్ఞాన మనియు, దానియందుదాసీనభావము గల్గియుండుటకు అపవర్గమ నియు, ముక్తియనియు వైరాగ్యమనియు పేరు. ప్రకృతిని యు దాసీనముగ జూచుటకు విరాగమని చెప్పెదరు. ప్రకృతిగుణముల ను నిర్లక్ష్యముగ త్యజించుటకు దృఢవిరాగమని పేరు.

ప్రశ్న:—ఇది దర్శనకర్తలలో నొకరగు కపిలుడు నాస్తికుఁ డని యనేకులు చెప్పుచున్నారు నిజమా? ఉత్తరము:—కపిలుడు తన దర్శనమందు "జీవాత్మ ఆనందస్వరూపుడుకాడు. బ్రహ్మానం దముయొక్క యుపభోగములకు జీవాత్మ ఆనందించుచున్నాడు" అని వ్రాసియున్నాడు. మఱియు, నీశ్వరుఁడు మాయతోఁగూడిన వాడుకాడు; కర్మజడము గనుక స్వయముగ కర్మఫలము జీవునకు లభింపదు, కర్మఫలదాతయగు నీశ్వరుఁడుండితీరవలయునని వివరిం చియున్నాడు. గావున కపిలుడు నాస్తికుఁడనుట కేవల మవివేక ము. సాంఖ్యదర్శనము పంచమాధ్యాయము ఇరువదియవ సూ త్రమునకు ఉదయనాచార్య భాష్యమును మఱియు సాంఖ్యార్య భాష్యమును చూడుడు.

ప్రశ్న:—జీవాత్మయొక్కటి గాక యనేకమెట్లు? ఉత్తర ము:—సుఖదుఃఖాది నానావిధములు లోకమందు ప్రతీతమైయు

న్నవి. ఆత్మయొక్కటియైనచో సంతటను సుఖము అథవా యంతటను దుఃఖము ప్రతీతికావలయును. అట్లులేదు గనుక జీవాత్మయొక్కటిగాక యనేకములై యున్నవి. ఇందుకు వేదప్రమాణములనేకములు గలవు. గనుక జీవాత్మయొక్కటికాదు. అనేకము. జీవుఁడే దేవుఁడనుట వేదవిరోధము; శాస్త్రవిరోధము.

భేదము:—ప్రక్రియాభేదమని సిద్ధాంతభేదమని రెండువిధములు. ఒకఁడు, అణువు, మహత్తు, దీర్ఘము, హ్రస్వమని నాల్గువిధములగు పరిమాణము లనుచున్నాఁడు. మఱియొకఁడు అణు-మహత్తులు మాత్రము చెప్పి దీర్ఘము హ్రస్వము లనావశ్యకమని విడుచుచున్నాడు. ఇందు వ్యవహార హానిగాని విరోధముగాని లేదు. ఇది ప్రక్రియాభేద మనఁబడుచున్నయది. దీనివలన సిద్ధాంతహాని లేదు.

శరీరభేదములు:—ఊష్మజ, అంతజ, జరాయుజ, ఉద్భిజ, సాంకల్పిక, సాంసిద్ధికమని యారువిధములు. పిశాచభూతాదికభేదములు మిథ్యావిశ్వాసములు. సాంకల్పిక శరీరములు అమైథున సృష్టిలో జేరినవి. సాంసిద్ధిక శరీరములు జీవన్ముక్తులు అథవా యోగీశ్వర శరీరములు.

ప్రాచీన యప్రాచీనములు:—వైదికమంతవ్యములు ప్రా

చీనములు అర్థాత్ సనాతన ధర్మములు. అవైదికమంతవ్యములు అప్రాచీనములు. అథవా యాధునికములు. సనాతన నూతనములను సిద్ధాంతముచేయుటలో ననేకులు భ్రమించుచున్నారని చెప్పవచ్చును.

యోనిభేదములు:—పశ్వాదులు భోగయోనులు, మనుష్యులు కర్మభోగ (మిశ్రమ) యోనులు. వృక్షాదులు అనుశయిఅర్థాత్ సుషుప్త్యవస్థాయోని తమోగుణాధిక్యములగు వృక్షాదులకు యోనిభేధములేదని సాంఖ్యమతము.

ముక్తి:—అవిద్యాది క్లేశనివృత్తితోఁగూడిన యీశ్వరానందముయొక్క యుపభోగమునకు ముక్తియని చెప్పబడుచున్నది.

సృష్టిప్రళయములు:—ప్రకృతియొక్క విరూప పరిణామమువలన సృష్టియు, స్వరూప పరిణామమువలన ప్రళయమగుచుండును.

శాస్త్రార్థము:—జయ విజయాపేక్షలతో చేయునప్పుడు లేఖబద్ధముగను, జిజ్ఞాసాపేక్షతో చేయునప్పుడు మౌఖికముగను, జరుగవలయును. అధర్మమును హఠమును కలిగినవారితో శాస్త్రార్థము చేయకూడదు. ప్రశ్నలు దోషయుక్తమై యుండినప్పు

ము ప్రత్యుత్తరములీయ నక్కరలేదు. దోషమునుచూపి నిరాక
రించవలయును. వాద వివాదనియమములను పాలించుటకు
అగ్రాసనాధిపతి యావశ్యకముగాని శాస్త్రార్థముయొక్క తీర్పుచే
యుటకుఁగాదు. తీర్మానము శ్రోతలయొక్కయు పాఠకులయొక్క
యు నిశ్చయములో నుండును.

# ప్రశ్నలలోఁగల భేదములు.

1 జిజ్ఞాసాప్రశ్నలు:—ఇవి విషయపరిచయముకొరకు వే
యబడునవి. ఉదా. పరమేశ్వరుఁడెట్టివస్తువు? అతఁడున్నాడనుటకు
నఖండనీయమైనయుక్తియేమి? ఇత్యాదులు.

2 శంకారూపములు:—అనుమాన పరిహారముకొరకు
వేయఁబడినవి. ఉ. ఈశ్వరుఁడు ప్రత్యక్షమా? పరోక్షమా? పరో
క్షమైతే "త్వమేవ ప్రత్యక్షంబ్రహ్మాసి" యను మంత్రమందు ప్ర
త్యక్షమని యేలచెప్పఁబడియున్నది? ఇత్యాదులు.

3 ఆజ్ఞారూపములు:—కూడదని ఆజ్ఞాపించు ధ్వని గలిగి
నవి. ఉ. నీవిప్పుడేలమాటలాడుచున్నాడవు? నీవిట్లుచేయవచ్చు
నా? ఇత్యాదులు.

4 ఖండనరూపములు:—హేతువునుజూపుచు ఆక్షేపించునవి. ఉ. భారతమునందు పరిక్షిత్తు సర్పదష్టుండై చనిపోయినట్లును, భాగవతమందు ప్రాయోప విష్టుండై ఆహారమును త్యజించి చనిపోయినట్లు చెప్పఁబడియున్నది. ఇందేది నిజము? ఇత్యాదులు.

5 ఉపహాసప్రశ్నలు:—వ్యర్థగపరిహాసముచేయుటకు వేయునవి. ఉ. సంధ్యావార్చుటలో మార్జనముచేయుట వలన ఆలస్యముదూరమగుట సత్యమైతే నశ్యమెందుకు వేసికొనకూడదు? అల్పముగ జలను చిలకరించుకొనుటచేత ఆలస్యము పరువెత్తునేని కొన్నిబిందెలు నెత్తినవోసికొని జన్మజన్మాంతరములయొక్కయాలస్యము నేలపారద్రోలకూడదు? ఇత్యాదులు.

6 అనుచితములు:—ఉచితముకానివి. ఉ. ఆరంభమందు స్వస్తివాచనముఁ జరుగుటవలన మధ్యల్పున స్తివాచనము జపింపవలయునుగదా? మొదట మంగలాచరణముచేసినయెడల కడపట అమంగళాచరణము జేయవలయునా? ఇత్యాదులు.

7 అసంభవములు:—సృష్టిక్రమమునకు విరోధమైనవి. పశ్వాదులు యీజన్మమందే మనుష్యులేల కాకూడదు? ఇత్యాదులు.

8. ఉభయములు:—ప్రశ్నకర్తకు, నుత్తరదాతకుల కిద్దరికి నన్వయించునవి. ఉభయులను బాధించునవి. ఉ. శ్రాద్ధము జీవిత పితురులకైనచో 'శ్రాద్ధేశరదః' యని శరదృతు విశేషమెందుకు? అని యడుగగా ప్రశ్నకర్తనుకూడ మృతపితురులకైనచో 'శారదికంశ్రాద్ధం' బని శరదృతు విశేషమెందుకని యడుగవచ్చును. కారణము జూపినపక్షము జయించును.

9 వైతండికము:—స్వపక్షసిద్ధాంతము కానట్టి ఖండనము. ఉ. అగ్నిహోత్ర లాభము మాకులభించలేదు. మీకులభించియుండిన మాకును ఆవగింజంత, వి. పి. ద్వారా పంపగలరా? ఇత్యాదులు.

10 యుక్తియుక్తములు:—తగినట్టిన్యాయమును ప్రతిపాదించునవి. ఉ. బ్రాహ్మణ వీర్యమువలనఁ బుట్టిన ధృతరాష్ట్రుఁడు క్షత్రియుఁడయ్యెను. నీచ స్త్రీ గర్భమందుద్భవించిన వ్యాసుఁడు బ్రాహ్మణుఁడయ్యెను. గనుక వీర్యక్షేత్రములు వర్ణమునకు ప్రధానములు కానప్పుడు గుణకర్మ స్వాభావములు ప్రధానములని చెప్పుటకు సందేహమేమి? ఇత్యాదులు

11 కుతర్కవాదములు:—హఠమును సాధించునవి. ఉ. మిరపకాయలో కారములేదా? యన్న-కారము నాలుకలోనున్నది

గాని మిరపకాయలో లేదని వాదించుట-జ్ఞానము సుఖదాయకమన అజ్ఞానమే సుఖదాయకమని చెప్పుట యిత్యాదులు.

12 నిరుత్తరములు:—ప్రత్యుత్తరమిచ్చుటకు సాధ్యము కానివి. ఉ. స్వర్గములోనికి సైతాను వెళ్లనగునా? వెళ్ళవచ్చున నిన నదియొక బజారువలె దుర్మార్గులు సన్మార్గులు సయితము వెళ్లునట్టి స్థలమయ్యెనుగదా? వెళ్ళకూడదనిన ఆదామును మోసపుచ్చుటకు నెట్లువెళ్లెను? ఇత్యాదులు.

ప్రమాణనియమములు:—ఒక క్రైస్తవునకును హిందువునకు వివాదము కలిగినప్పుడు, క్రైస్తవుడు హిందువునమ్మునట్టి వేదాది ప్రమాణములను చూపవలయును. హిందువు క్రైస్తవుడు నమ్మునట్టి బైబిలు మొదలగువాని ప్రమాణములను చూపవలయును. ఒక పౌరాణికుడును ఆర్యసమాజకుడును వాదించునప్పుడు పురాణ మతమువాడు ఆర్యులు సన్మానించు వేద శాస్త్రములను చూపవలయును; ఆర్యులు పురాణ ప్రమాణముల జూపవలెను. ఒకమహమ్మదీయునితో ఒకజైనుడు వాదించునప్పుడు మహమ్మదీయుని కురాను జైనునకు ప్రమాణము కానేరదు. ఇప్పుడనేకులిందుకు వ్యతిరేకముగ ప్రవర్తించుచున్నారు. ఉభయులొక్క మతము వారైనప్పుడు స్వతః పరతః ప్రమాణములను నిర్ధరించుకొనవలయును.

విరోధప్రమాణములు:—1 లక్షణ విరుద్ధములైనవి. 2 సృష్టివిద్యకు విరుద్ధములైనవి. 3 ప్రత్యక్షమునకు విరోధములైనవి. 4 స్వభావ విరుద్ధములైనవి ప్రమాణములు కానేరవు. మఱియు గుణము వర్ణము ఇత్యాదిభేదములతో లక్షణప్రత్యక్ష స్వభావములలో కొన్ని భేదములు గలవు. బంగారునకురంగు, భారము లక్షణములు రెండువిధములు. సృష్టి యీశ్వరక్రమము సృష్టి క్రమమని రెండుభేదములు. ప్రత్యక్షమాత్మికము మానసికము శారీరికము అథవా స్థూలము సూక్ష్మము ఇత్యాదిభేదములు గలది.

ప్రత్యుత్తరములు:—ప్రశ్నయొక్క విధమును కనుగొని దానికి తగు యుత్తరమియ్యవలయును. కొన్ని ప్రశ్నలు దీర్ఘములై యుండియు అల్పమగు ప్రత్యుత్తరమును గోరుచుండును. కొన్నిప్రశ్న లల్పములై యుండియు దీర్ఘమగు నుత్తరములను గోరుచుండును. కొన్ని సమానములై యుండును. ప్రత్యుత్తరమునకు యోగ్యముగానట్టి ప్రశ్నల కుత్తరములకు బదులు దానియందలి దోషములు చూపవలయును. తెలిసియు ధర్మహాని సంభవించునట్లు ప్రశ్నించువారికి ప్రత్యుత్తరము లియ్యకూడదు. "అధర్మేణతుయః ప్రాహాయశ్చాఽధర్మేణ పృచ్ఛతి తయోరన్యతరః ప్రైతివిద్వేషం వాధిగచ్ఛతి', యిట్లు అధర్ములతో వాదించుటవలన ద్వేషముతప్ప మరేమియు లేదు.

ఇప్పుడనేకులు ప్రశ్నోత్తర లక్షణము లెరుంగక మాకు ప్రశ్నలు వేయుచున్నారు. ఈదోషనివారణార్థమై మేమీ న్యాయదర్శన పరిచయమును ప్రచురింప వలసివచ్చినది. ఇందుకు నుదాహరణముగ బుక్కపట్టణ నివాసులగు దుర్భాక సీతారామ శాస్త్రిలనువారు మాకుకొన్ని యనుచితమగు ప్రశ్నలను బంపిరి. మేము వానికిదగిన ప్రత్యుత్తరములను ప్రచురించితిమి. దానిపై వారొక గ్రంథమును ప్రచురించిరి. దానిపై మేమేమియు బదులు వ్రాయవలసిన యగత్యము లేకనే దానిని పఠించినవారు పరిరించిన వ్యాసము లింద్రకింద జేర్చుచున్నారము. ఈవ్యాసములన్నియు వర్తమాన పత్రికలలో ప్రచురింపబడినవి. వానిలో ముఖ్యమైన వానిని మాత్రము ప్రచురించుచున్నారము.

# అనార్య మత ఖండన విమర్శనము

-:o:-

బుక్కపట్టణము దుర్భాక సీతారామశాస్త్రి అనువారు అనార్యమతఖండన మను గ్రంథ మొకటి ప్రచురించినారు. అందు ఆర్యసమాజ నియమములు పదిలో నొక్కదానినైనను, మంతవ్యములు, యేబదియొక్కటిలో నొకదానినైనను ప్రమాణ

యుక్తముగ ఖండిచలేము. శ్రీమద్దయానంద సరస్వతీ స్వాముల వారిని, ఆర్య నారాయణమూర్తిగారిని మిక్కిలి కఠినముగను, క్రూరముగను నిందించి దూషించియున్నారు. స్వాములవారిపై వ్రాసిన శాస్త్రిగారి సాహసమును వర్ణింప నెవరితరము? మొత్తమున గ్రంథము సజ్జనులుపఠింప దగినదిగా నుండలేదు. అందొక్క విషయమును విమర్శించి సీతారామశాస్త్రిగారి యోగ్యతను చూపెదము. "ఆశ్వినస్యసితేపక్షే" అను దానిలో అచ్చుపొరబాటును (అశ్వినస్యసిపక్షే) గట్టిగ పట్టుకొని 7 యేడక్షరములుండుట తప్పని మూర్తిగారి గ్రంథమున 8 నెనిమిదక్షరములుండుట జూచియు, దానిని దాచి లోకులను భ్రమింపజేయుటకు అధికప్రసంగము చేసినారు. దాని అర్థవివరము చేయుటలో "అసితేపక్షే" యని పదవిభాగముచేసి అసితపక్షమన బహుళపక్షమని లోకులను వంచించిరి; మంచిది, అదే జాతకాభరణమందు "ఆషాఢస్యసితేపక్షే పంచమ్యాం భృగువాసరే । నిశాయాం హస్తనక్షత్రే సిద్ధం సర్వథాభవేత్ ॥ అని యున్నది. ఆషాఢ శుక్లపంచమికిగాని, కృష్ణపంచమికిగాని హస్తానక్షత్రయోగము సిద్ధింపదు. ఇట్టి మిథ్యాశాస్త్రమును సత్యశాస్త్రమని సాధించుటకు, సితమును అసితమని మైరావణమాయచేసి ఆర్యులు జాతిభ్రష్టులు కులభ్రష్టులు అభక్ష్యభక్షులని యానెపముతో తిట్టుచు శాస్త్రులవారు జయించితిమని చంకలుగొట్టుకొని

సంతసించిరి గాని, ముందు వెనుకలు చూడలేదు. మకరరాశి వాడు "శ్రావణస్యసితేపక్షే దశమ్యాం భౌమవాసరే । జ్యేష్ఠాయాం నిధనంన్యాసం చంద్రే మకరసంస్థితే" యను శ్లోకమును బట్టి శాస్త్రిలవారి అర్థముచొప్పున శ్రావణబహుళ దశమీ జ్యేష్ఠానక్షత్రమునాడు చనిపోవలయును. ఆనాడు రోహిణీనక్షత్రము వచ్చును గాని జ్యేష్ఠానక్షత్రము రాదు. ఇక్కడ సితే పక్షే యని పదవిభాగము చేసినయెడల 'అశ్వినస్యసితేపక్షే' యనుదాని నెట్లు అసితమని అర్థముచేయుదురు? అచ్చటను సితేపక్షమని యర్థముచేయక తప్పదు. ఇప్పుడు శాస్త్రిగారికి ప్రాణసంకటము సంభవించెను. శాస్త్రిలు మూర్తిగారి గ్రంథమునుజూచి దిక్కుతోచక అవకతవకార్థముల్వ్రాసి పామరులను భ్రమింపజేసిరి కాని, పండితులెట్లు భ్రమించగలరు? శాస్త్రి లింకొకసంగతిని దాచియుంచిరి. జాతకాభరణమునకు విరోధముగ మానసాగరీ గ్రంథమందు మీనరాశివాడు "మాఘమాసే శుక్లపక్షే తిథి ద్వాదశ ఉత్తరాభాద్రనక్షత్రే గురువారే ప్రాతఃకాలే దేహంత్యజతి" యని పరస్పరవిరోధముగలదు. ఇది శాస్త్రిగారికి లెక్కలేదు. ఎందుకన నొకగ్రంథములోని పూర్వాపరవిరోధములు లెక్కచేయకూడదని వారే పలుమారు వాదంచుచున్నారు. భారత భగవద్గీతలలోగల వ్యత్యాసములను గణింపక అంతయు ప్రామాణముగ స్వీకరింపవలెనట! గీతలో "నక్షత్రములలో

నేను చంద్రుడను'' అని చెప్పఁబడినది. చంద్రుఁడు నక్షత్రముల లో చేరినవాఁడు కాదని ప్రతివిద్యార్థికి తెలియును. ఏమైన నేమి శాస్త్రిగారి కంతయు ప్రమాణమే. ఒకవేళ ప్రక్షిప్తమని యొప్పుకొనిరేని, దానిని ఆర్యులు చేర్చియున్నారని చెప్పివేయుదురు. శ్రీ మూర్తిగారి గ్రంథములోని పైయంశములు చర్చకు వచ్చి శ్రీ కస్తూరి శివశంకరకవి ముఖ్యగువారు మూలగ్రంథములను దెప్పించి చూచి, మూర్తిగారి వాదమంతయు సత్యమని జ్యోతిష్కుల చర్చ అనుగ్రంథములో 36వ పేజీలో పరస్పర భేదవాదమను దానిలో విస్పష్టముగ వ్రాసియున్నారు. శాస్త్రిగారూ! తాము తమగ్రంథములో 32వ పేజీలో వ్రాసినదాని నిట్లు మార్చుకొనవలయును. "సత్యా సత్య భయంనాస్తి సీతారామస్య సన్నిధౌ'' అని యుండవలెను. మీరు మూర్తిగారి శపథమును గెలువజాలక, వారిని, మఱియు నిష్కారణముగ శ్రీ మద్దయానంద సరస్వతీస్వాములవారిని తిట్టుట భావ్యముకాదు. వారు స్వర్గస్థులై ముప్పదేండ్లయినది. వారిని మీవాదములకు ప్రత్యుత్తరములిమ్మని కోరితిరే! ఓహో! ఇది మీఫలిత జ్యోతిషమువలన తెలసికొంటిరా? మీవాదమున కంతటికి శ్రీ మూర్తిగారి గ్రంథములును, శ్రీ స్వాములవారి గ్రంథములును ప్రత్యుత్తరములుగా నున్నవని మీకును మీమిత్రులకును జూపుచున్నారము.

శాస్త్రిగారు అనార్యమతఖండన మని మొదటను, ఆర్య మతఖండనమని కడపటను, వ్రాసిరి. తప్పులన్ననో తుప్పలుగాను న్నవి. ఇట్టి వీరుమూర్తిగారి వ్యాసములోని యొక యక్షరములో పమునకు నెంతయో ప్రలాపించిరి? జాతి వర్ణము అను మూర్తిగారి యుపన్యాసము చదివియు, జాతియననేమో తెలిసియు, గ్రహించలేక జాతి నీతిలేనివారని యాక్షేపించిరి. వీరు మానవేతర జాతినీతులు గలవారట! ఆర్యులు వైదికమతమువారని వారిగ్రంథములలో స్పష్టముగ తెలియుచుండగా, వేదదూషకులని వ్రాసిరి. దయానందులవారి వేదభాష్యములను వారురచించిన సత్యార్థ ప్రకాశికాది యుద్గ్రంథములు పరికించినవారికి, వారొకగొప్ప విద్వాంసులని నిష్పక్షపాతులని, మహర్షియని, వేద్యమగుచుండగా, వారిని కపట సన్న్యాసియని నీచముగలిఖించిరి. వారి మతము రాక్షసమనిరి. నాస్తికులని ప్రకటించిరి. సత్యార్థ ప్రకాశిక పంద్రెండవ సముల్లాసమును చూచినచో, యెవరు నాస్తికులనుట స్పష్టమగును. స్వధర్మ పరధర్మములను గురించి ఈశ్వర రహస్యసారమున విశదమగుచుండగా చదివియు మరల స్వధర్మమన స్వకుల ధర్మమని కవిత్వముచేసి, మూర్తిగారిని కుకవియని తిట్టిరి. కులభ్రష్టుండనిరి. మూర్తిగారికి గ్రంథముల పట్టిక జూపుచు వారు రచింపని పరుల గ్రంథములను సయితముజేర్చి ఇవన్నియు మిథ్యావాదములని వ్రాసిరి. అగ్నిహోత్రమును వాని మంత్రములను కర్మలను గు

రించి నాస్తిక ప్రశ్నలనువేసిరి, అన్నింటికి సమాధానము అగ్నిహోత్ర పద్ధతియను గ్రంథమందుండియు నవి కొరగాదనిరి. దేవతలనుగురించియు దేవశబ్దమునుగురించియు మూర్తిగారి గ్రంథములందును సత్యార్థ ప్రకాశికయందును జూచియు, మరల పాడినదానినే పాడిరి, అగ్ని సంస్కారమునుగురించిన శంకలకన్నింటికి సమాధానము సంస్కారచంద్రికలో చూచుకొనుడనిన దానినివినరైరి. మూర్తిగారు ప్రకాశికలో ప్రచురించినదానిని పెడచెవినిబెట్టిరి. వేదవిషయములన్నింటిని భాష్యభూమికలో జూడుడనిన దానిని గమనింపకపోయిరి. వైదికవిషయములలో వీరు కేవల మజ్ఞానులై ప్రశ్నలు వేయుచు, పయిగా వైదిక గ్రంథములన్నియు మిథ్యలనిరి. వీరు నిజముగ బాలిశ్యులై యుండిన, నీశంకలకాస్పదముండదు. చెప్పినను గ్రహించు యోగ్యతలేదు. చదివిన దానిని అర్థముచేసుకొన జాలరు. వీరి అర్థజ్ఞాన మిదివరకే పాఠకులకు విదితమైయున్నది. శ్రాద్ధనిర్ణయమును పఠించియు, మరల నట్టిప్రశ్నలనే వేయదొడగిరి. ఫలితజ్యోతిష మథర్వణ వేదములో నున్నదని వ్రాసిరి. వీరు వ్రాత నిజమగునా? కాదా? యని విమర్శనముజేయువారు వైదిక యంత్రాలయము (మీరటు) నకు వ్రాసి తెప్పించి చూడవచ్చును. అధర్వమునందుండదు అధర్వణమునందుండవచ్చునేమో? కృష్ణయజుర్వేదమునుగురించిమూర్తిగారి చ్చిన ప్రత్యుత్తరములను చూడజాలకపోయిరి. భాష్యకర్తలు అ

న్ని వేదములకు భాష్యము వ్రాసితీరవలయునని, వీరును వీరి తా తముత్తాత లాజ్ఞాపించియున్నారట. మహీధరుఁడొక వేదమున కేల భాష్యమువ్రాసెనని ఆగ్రహపడి వానిపై దాడివెడలిరి. వీరిప్ర శ్నలకు త్తరము లిచ్చుటకు గ్రంథములనుచెప్పరాదట. ఆగ్రంథము లే మరలవ్రాసి చూపవలెనట. ఆర్యులొక్కొక్క విషయమును గురించి యొక్కొక్క గ్రంథమువ్రాసి వేలకొలది గ్రంథములు సిద్ధముచేసియున్నారని వీరికి యెంతచెప్పినను చెవిటిముందర శం ఖూదినట్లున్నది. ఒక గ్రంథములో పరస్పర విరోధాంశములను గాని అసంభవాంశములను గాని ధర్మవిరుద్ధములనుగాని ప్రత్యేక ముగ వివేచన చేయక యన్నింటిని ప్రమాణముగ స్వీకరింపవలయు నట. సూర్యాది గ్రహములు గోళములుగావట. విద్యార్థులారా! నవ్వకండి! నవ్వకండి!! మానవరాజునకువలె పరమేశ్వరునకు నయినను మంత్రులు పురోహితులు భార్యలు బిడ్డలు న్నారట. అది ఆర్యు లెరుంగరట! ఇది తిత్తిరి తత్వమట! తమచేతితోడనే "విగ్రహారాధనము" అని వ్రాయుచు, ఈశ్వరారాధకులను నా స్తికులనిరి. విగ్రహారాధనము చేయువా రాస్తికులట! మూర్తి గారు మహమ్మదీయ మతపరీక్ష యనుగ్రంథమును తమకుమార్తె కంకితముచేసిరట? ఈ శుద్ధయబద్ధమును తమ ఫలితజ్యోతిషము వీరికి జెప్పెనుకాబోలు? ఇందువలన శాస్త్రిగారు మూర్తిగారి గ్రంథములను కంటితోజూచి యెఱుంగరని సిద్ధాంతమైనది.

ఈశ్వరసిద్ధి యను గ్రంథమును మూర్తిగారు రచించియున్నారట. ఇట్టివెల్ల లనేకములు తమ గర్హితగ్రంథమున వ్రాసిరి. ఇట్టి దుష్టులు, కృష్ణమూర్తి మద్యపానియనుట సిద్ధాంతముగ జూపె దరని యొక ప్రక్షిప్తమును మూర్తిగా రుదాహరించగా, ఆదోషము మూర్తిగారిపై మోపిరి. మాంసభక్షణనిషేధము మద్యపానవర్జనమును వ్రాసిన మూర్తిగారు గోప్యముగను అంతరంగముగను వానిని పుచ్చుకొనుచున్నారని శాస్త్రిగారు వ్రాసిరి. దీని యర్థాపత్తివలన, నేది నిషిద్ధమని యెవరు వ్రాయుదురో వారంతరంగమున బుచ్చుకొందురనియు వ్రాయనివారు బహిరంగముగ బుచ్చుకొందురనియు సిద్ధమయ్యెను. శాస్త్రికి తెలిసినది కదా? అది అంతరంగ మెట్లయ్యెను? చూడుడీ ధూర్తవాక్య మెట్లున్నది. శాస్త్రిగారు బహిరంగము యాగాదులందు జంతువులను జంపి మాంస మద్యముల బుచ్చుకొనుట వారి తైత్తిరీయవేదమువలన నందరికి తెలిసియేయున్నది. గనుకనే యాగాదులందు పశువిశసనమును జంతుబలులను జేయనివారు బ్రాహ్మణులుగారని కరపత్రములు ప్రచురించిన తైత్తిరీయ శాఖవారగు శివపురపు వీరభద్రపాకయాజిగారిని శాస్త్రిగారు తమగ్రంథమున మిక్కిలి పొగడియున్నారు. తైత్తిరీయసిద్ధాంత మిప్పుడందరికి తెలియవచ్చెను. వీరు తమవలె నితరులుందురనుకొనిరి. మఱియు వెఱ్ఱివ్రాతలు, అబద్ధములు, అవ్యక్తప్రసంగములు, అనర్థ

కారచేష్టలు, అప్రమాణములు, అర్థానర్థములు, నిండియున్న శాస్త్రిగారి గ్రంథమే, వారి మైకమునకు సాక్షిగానున్నది. మీకు ప్రత్యక్షముకావలయునన్న నేమిదివరకే వ్రాసిచూపినట్లు "అశ్వి, నస్యసితే ఆషాఢస్యసితే" శ్రావణస్యసితే త్యాది శ్లోకములకు జవాబులిపక్షముగ అర్థముచేసి తప్పక పరిక్షించుడు.

(కరణం ధాళప్ప. తాతా లక్ష్మయ్య.)

# అనార్యమతఖండన సమీక్ష.

——:o:——

సీతారామశాస్త్రిగారు 14వ పేజీలో "ఆర్య నారాయణ మూర్తిగారు ఒకప్రశ్నకైనను ఉత్తరమిచ్చు శక్తి జాలక ఉన్మత్తులసకమై వదరుచున్నారు. చండాల స్వర్గమున తలక్రిందుల "వ్రేలాడుచున్నారు" అనివ్రాసినవాక్యము లెంతవరకు నిజమో సమీక్ష చేయుచున్నారము. ఇందు 32 ప్రశ్నలున్నవి. వీనిని శాస్త్రిగారు మొదట లేఖన మూలముగ బంపియుండిరట. మూర్తిగారందుకు 1919 మేనెల 24 తేది మొదలుకొని ప్రకాశికలో నుత్తరములను ప్రచురించి యుండుట నేజూచినాడను. ముద్రిత గ్రంథములోని మొదటి ప్రశ్న "(1) అగ్నిహోత్ర కర్మయందు మీకు స్వానుభవమైన లాభములను మాకు చూపగలరా"

యని యున్నది. లేఖనములోని మొదటిప్రశ్న "(1) అగ్నిహోత్రము ద్విజస్త్రీ) పురుషులు చేయవలెననియు, స్వాహాశబ్దము నోటితో చెప్పుటవల్లను ఆవాసనను మనము పీల్చుటవల్ల ఆరోగ్యజ్ఞానములు గలుగునని తమపుస్తకములోనున్నది. మాగ్రామ సమీపమున అనేకపర్వతములు గలవు. అందులో సమస్త ఓషధులున్ను మీరు వ్రాసిన పదార్థములన్నియు కలవు. ప్రతి సంవత్సరము కొండలన్నియు అంటుకొని వసంతఋతువుమొదలు వర్షఋతువువరకు కాలుచునేయుండును. ఆ హోమధూమము మాకు కనీసము 4-5 మాసములు అహోరాత్రులయందును తగులుచుండును. ఓషధుల భస్మము మాయిండ్లమీదను వాకిండ్లమీదను కావలసినంత దొరుకును. అయితే మీ పుస్తకములో వ్రాసిన మస్తిష్కముమాత్రము యెక్కడను కానరాదు. గృహదాసము లనెడు వేదోక్తయజ్ఞములు జరుగుచునే యుండును. లాభముమాత్రము లేదు. మీరాచరించిన అగ్నిహోత్ర సంధ్యాలాభములో కనీసము ఒక ఆవగింజంత భాగమైనను మాయందు దయయుంచి, మాకు వి. పి. ద్వారా పంపించినయెడల మేమానందభరితులము కామా"? ఇత్యాదులు గలవు. ఇందుకు మూర్తిగారిచ్చిన ప్రత్యుత్తరము. "మీరువ్రాసిన యగ్నిహోత్రి సూర్యపద్ధతిప్రకారము సంభవించలేదు. మాయజ్ఞము పశు క్రిమి కీట విరహితమైనది. సుగంధద్రవ్య యుక్తమైనది,

మీరు వ్రాసినది మీకృష్ణయజుర్వేదప్రకారముగ సనుగుణ్యమైనది. అందనేక క్రిమికీటకాదులు భస్మీభూతములైనవి. దానిలో నొక్కటులమైన కేసరి కర్పూరాది సుగంధములుచేరవు. ఘృతాదులు బొత్తిగలేవు. క్రిమి కీట పశు పక్షి సర్ప వృశ్చికాది జంతు సంతానయుక్తమగు తైత్తిరీయ యజ్ఞమువలన మీమస్తిష్కము చెడి మతిభ్రమించి వ్యాకులత సంభవించుట కేమి యభ్యంతరము?" ఇత్యాదిగనిచ్చిన ప్రత్యుత్తరములు సర్వజనవిదితములు. ప్రశ్నలలో నింత భేదముండియు శాస్త్రిగారీ సంగతి దాచినందుకు నాకు చింతగానున్నది. మూర్తిగారి ప్రత్యుత్తరములు ప్రశ్నలకు తగినట్లుండుట మనకు దెలియుచునేయున్నది. ఇట్లుండియు తమ ప్రశ్నల కుత్తరములియ్యని యుస్మత్తకునకమనుట మిక్కిలి యక్రమమని నాకు దోచుచున్నది. ప్రశ్నలు జిజ్ఞాసకొరకు వేయబడినవి కావనియు, గెలుపొందవలయునని వేసిన పరిహాసములనియు, వేద్య మగుచున్నది. ఎందుకన శాస్త్రిగారును అగ్నిహోత్రము చేయువారే. అయినను శాస్త్రిగారి బలవంతమువలన మూర్తిగారు ప్రత్యుత్తరములిచ్చి సందేహనివర్తి కావలయునన్న సంస్కారచంద్రికను చూడుడని వ్రాసియున్నారు. మఱియు నిదే ప్రశ్నలను మీగురువుల నడిగి ప్రత్యుత్తరములు బడయవలయునని వ్రాసినారు. ఇదియును సమంజసమే. శాస్త్రి రెండవప్రశ్నలో "మాత్రసంబంధమాత్రముతో ఈశ్వర

ధ్యాన మెటుల గలుగు నని యడిగిరి. ఆ మంత్రములు సూర్య సంబంధమని ఆర్యులు చెప్పియుండలేను. ఈశ్వరసంబంధమని సంస్కారచంద్రికలో భాష్యమున్నది. సూర్యసంబంధమనువారు శాస్త్రులవారు గనుక నీప్రశ్న కుత్తరము శాస్త్రులవారు చెప్ప వలసియున్నది. గనుక శాస్త్రులవారికి ప్రశ్నలు వేయుట సయి తము తెలియదనుటకు వగచుచున్నాను. ఇందుకు పైప్రశ్నయే నిదర్శనముగానున్నది. మూడవప్రశ్నలో ఈశ్వరునకు సాకారము కల్పించబడినది సాకారధ్యానమా? నిరాకారధ్యానమా? " యని యడిగిరి. లేనిదానిని యున్నట్లు చెప్పుటకు కల్పనమనిపేరు. కల్ప నము సిద్ధాంతము కానేరదు. గనుక ఈశ్వరునికి సాకారము కల్పి తమైనప్పుడు నిరాకారము నిజమయ్యెను. గనుక సాకారధ్యాన ము కల్పితమయ్యెను. శాస్త్రిగారు ప్రశ్నలువేయుటకు ముందు శ్రీమద్దయానంద సరస్వతీస్వాములవారి వేదభాష్యమును చూడ వలెను. పిదప సాయణ విద్యారణ్య మహీధరాది భాష్యముల కును దీనికిని భేదము చూడవలయును. అట్లు చూడక దయా నందులు కపటసన్న్యాసి, నాస్తికుడు, అనార్యుడని వ్రాసి యుండుట మిక్కిలి వ్యసనకరమైనసంగతి. హిమవద్గిరి ప్రాం తములలోసంచరించి, విరజానందాది మహానీయులవద్ద 4 సం వత్సరముల వరకు విద్యాభ్యాసము చేసి ఆద్యంత బ్రహ్మ చారియై సమస్త భాష్యములలో గల దోషములను కారణ

యుక్తముగజూపి వేదభాష్యములు వ్రాసినవారి వ్రాతలను వారి మంతవ్యములను అందరును త్రోసివేయుట సంభవించునా? కొందరైనను నమ్ముదురు. అట్లునమ్మువారే ఆర్యులు, అథవా ఆర్య సమాజికులు. షోడశసంస్కారవిధులన్నియు ప్రాచీనులు గృహ్య సూత్రములందు వ్రాసినారు. వానినెల్ల శ్రీమద్దయానంద సరస్వతీ స్వాములు పరిశోధించి అందలి పరస్పర విరోధములు అనుపాదేయ భాగములను గనుగొనిన నిర్దోషముగ సంస్కారవిధిని వ్రాసియున్నారు. అందుకు వ్యాఖ్యాన వాచస్పతి, స్వతంత్రప్రజ్ఞతార్కిక శిరోమణులగు పండిత ఆత్మారామ, భీమసేన శర్మయనువారు సంస్కారచంద్రికను వ్రాసి సమస్త సందేహములకు సమాధానములు కారణయుక్తముగవ్రాసియున్నారు. ఇదిదాదాపు 800 పేజీలుండ వచ్చును. ఈలాగున ప్రతివిషయమునకును గ్రంథములున్నవి. ఎవరైన సత్యార్థప్రకాశికయను గ్రంథముపై ప్రశ్నించిరేని భాస్కర ప్రకాశికయను గ్రంథమును జూపెదరు. ప్రత్యంశమునందును నలువది సంవత్సరములుగ నుత్తరదేశమునందు శాస్త్రార్థములు జరుగుచున్నవి. ఆర్యులయొక్క విశ్వవిద్యాలయములు కాలేజీలు హైస్కూల్లు గురుకులములు (వేదపాఠశాలలు) కన్యావిద్యా మహాలయములు, అనాథశరణాలయములు, గోరక్షణశాలలు, దినదిన ప్రవర్ధమానములగు వెలయుచున్నవి. కోటిరూప్యములకంటె నధికముగ మూలద్రవ్యమున్నది. మహారాజు లనేకులును, దేశభ

క్తులును, ఆర్యప్రతినిధి సభలో సభికులయియున్నవారు. ఈసంఘ మునుగురించిగాని, సంఘనియమములు మంతవ్యములనుగురించి గాని స్వామిదయానంద సరస్వతీ యతీశ్వరులనుగురించిగాని, సీతా రామ శాస్త్రిగారికి నితాంతముగ నేమియు తెలియదని వారి వ్రాతలవలన వేద్యమగుచున్నది. శ్రీమదార్య నారాయణమూ ర్తిగారును బాల్యమునందుత్తరదేశ సంచారమువెళ్ళి ఆర్యభాష నభ్యసించి వైదిక సిద్ధాంతములను ఆంధ్రమునమన దేశమున వ్యాపింపజేయుటకొరకు గ్రంధమాలికను స్థాపించి పనిచేయుచున్నా రు. వీరితోనింతవరకనేక పండితులు వాదవివాదములు జరిపియు న్నారుగాని శాస్త్రిగారివలె తామే కలహమునకు కారకులై యుం డి యనుచితముగా నట్టి ప్రశ్నలను బంపియు, నిచ్చిన ప్రత్యు త్తరముల నొప్పకయు, నిచ్చిన ప్రశ్నలను మార్పుచేసి ప్రచురిం చుటయు, ప్రత్యుత్తరము లియ్యలేదనియు, గోప్యముగ మాంస భక్షణము మదిరాపానముచేయుదురనియు, కుక్కలనియు, నక్క లనియుప్రచురించిన వారెవరునులేరు. ఇది మిక్కిలివ్యసనకరము. శాస్త్రిలవారు(ఆర్యులనుజయింపవలెననుకోరికయుండెనేని)దయా నందవేదభాష్యములనుఖండించి తమపాండిత్యమునులోకమునకుం జూపినచో తప్పకజయింపగలరు. హిందూదేశమందిప్పటికెవరును గానరాలేదు. నభూతోన భవిష్యతియని నామట్టునకు నేను నిశ్చ యించియున్నాడను. నాకు పరిచయుకు కొందరిట్లే మూర్తిగారిపై

కవచముఁదొడిగి కలహమెత్తికొన్ని లేఖలనంపి పిమ్మట ఆర్యగ్రంథములను శోధించి మౌనముధరించి తమమానముఁగాపాడుకొనిరి. ఎవరుగాని దేనిని ఖండింపబూనెదరో, దాని సంగతి బూర్తిగ తెలిసికొనవలయును. మూర్తిగారి ఫలితజ్యోతిషఖండనముపై చర్చజరిగినది. తీర్మానమైనది. శాస్త్రిగారు దానిని పఠించకనే బరిశోధించకనే తప్పుచేసిరి. దయానంద సరస్వతులు సాకారేశ్వరధ్యానముచేసిరని యేదోగ్రంథముః (మతఖండనము)ను జూపుటయు, మూర్తిగారురచింపని గ్రంథముల నుదహరించుటయు, సరస్వతీస్వాములవారింకను జీవించియున్నట్లును, ఆర్యులు నాస్తికులని వేదవిరోధులని వ్రాయుటయు, మూర్తిగారి గ్రంథముల నన్నిఁటిని జూడకనే చూచినామనుటయు, తామాచరించు కర్మను తామే ఖండించుకొనడము, తామే కలహమునకు కారకులైయుండియు మూర్తిగారిని గురిచేయుటయు, మూర్తిగారి పంతమును గెలుచుటకై చేసినయనర్థమును, పదికాసులైనను వెలచేయని తమపుస్తకమును పదియణాలకు పంపుటయు, మున్నగువానినెల్ల జూచి నేను మిక్కిలిచింతిల్లెద.

రెండవది మూర్తిగారు శపథమును సీతారామశాస్త్రిగారు జయించితిమనునది. వివాదాంశము "అశ్వినస్యసితే పక్షే ద్వితీయా యాంగురోర్దిని నైరృతిర్నామ నక్షత్రే సాయంప్ర

త్యర్ణ సంశయః" ఇచ్చట ఆశ్వీజశుద్ధ విదియ గురువారమునా డు కృత్తికానక్షత్రయోగము రాదని మూర్తిగారి ప్రతిజ్ఞ. శాస్త్రిగారి శ్లోకమునకు అశ్విన స్యాసితేయని మూలగ్రంథమున నున్నదనియు అసితేయని పదవిభాగము గనుక శుద్ధమనుట తప్పనియు కృష్ణపక్షమని అర్థముచేసిరి. నేను శాస్త్రిగారికి జాతకాభరణమును పంపుడని వ్రాసితిని. మూర్తిగారికిని వ్రాసితిని. మూర్తిగారు నాగరాక్షరములతో నుండిన ప్రతిని పంపిరి. శాస్త్రిగారు పంపలేదు. మూర్తిగారు పంపిన జ్యోతిశ్చంద్రికలో పంద్రెండు రాసులకును శ్లోకములున్నవి. అందు మూర్తిగారు వ్రాసినట్లేయున్నది గాని శాస్త్రిగారు వ్రాసినట్లు 'స్యా' యని దీర్ఘములేదు. అర్థముసయితము శుక్లపక్షమని వ్రాయఁబడినది. మరియు "ఆషాఢస్యాసితేత్యాది శ్లోకములకు శుక్లమని అర్థము చేయవలయునని శాస్త్రిగా రొప్పుకొనిరి. ఆషాఢస్యాసితేపక్షే పంచమ్యాం భృగువాసరే। నిశాయాం హస్తనక్షత్రే నిధనంసర్వథా భవేత్॥ ఇచ్చట ఆషాఢ శుక్లపంచమికి హస్తానక్షత్రము రానేరదు. దీనిని కృష్ణపక్షముగ మార్చినను హస్తానక్షత్రయోగము సిద్ధింపదు. శాస్త్రిగారు చూపిన సిద్ధార్థినామ సంవత్సర ఆశ్వయుజ బహుళవిదియనాఁడు కృత్తికానక్షత్రము కొన్ని గడియలుండినను వారము శనివారముగ నుండుటచేతను, శాస్త్రిగారి వాదము హేత్వాభాసమని విస్పష్టమయ్యెను. ఇదియుఁగాక

మూర్తిగారి గ్రంథమందలి ఆద్యపక్ష విషయమై చర్చజరిగినది. మూర్తిగారు పితృలోక మహాసభయను గ్రంథమును ప్రచురించి నప్పుడు దానికి విరోధముగ మాతృలోక మహాసభయను వ్యాసము ప్రకటింపఁబడినది. సత్యాసత్య నిర్ణయముకొరకు శ్రీకస్తూరి శివశంకరకవి మొదలగువారు చర్చించి ఫలితజ్యోతిష చర్చయను గ్రంథమును ప్రచురించి, మూర్తిగారిగ్రంథ మద్వితీయమని అకాట్యమని తీర్మానించియున్నారు. గనుక మూర్తిగారి వాదమోడిపోయినదనిశాస్త్రిగారువ్రాయుట సమంజసముకాదు. శాస్త్రిగారు 'స్య' కు దీర్ఘమిచ్చినను యివ్వకున్నను యోగము సంభవింపని శ్లోకములున్నవి. మఱియు తమవాదమునకు గ్రంథ ప్రమాణము చూపజాలక నీవిషయమున గురుముఖమున తెలియవలయునుగాని శబ్దార్థమాత్రము పనికిరాదని లిఖించియున్నారు. వారు నాకు సంస్కృతమున వ్రాసినట్లే నేనును "ఆర్యులు నీవిధముననే వేదార్థమువారి గురువులముఖమున తెలియవలెను" అని చెప్పుటకు హేతువగునని వ్రాయవలసివచ్చెను. అసత్యమని యిదివరకే సిద్ధాంతమైన ఫలశాస్త్రమును సత్యమని సాధించుటకు గురువులు కావలసి యుండునను వాద మెంతమాత్రము పనికాదు. మూడవది శ్రీ మద్దయానంద సరస్వతీ స్వాములవారు రచించిరని శాస్త్రిలవారు వ్రాసిన మతఖండనమనునది గ్రంథము కాదు. అది కరపత్రము. స్వాములవారు రచించినదికాదు. ఒక

నాయకుమగారు ప్రచురించినది. అది పాకయాజిగారికిని శ్రీగోపాల సచ్చిదానంద బ్రహ్మేంద్ర సరస్వతీ స్వాములవారికిని జరిగిన వివాదసంబంధమైనది. శాస్త్రిగారి దేవిధమున మూర్తిగారు రచింపని గ్రంథములనెల్ల వారు రచించినారని వ్రాసిరి. ఈవ్రాతలను బట్టిచూడగా శాస్త్రిగారు శ్రీదయానంద సరస్వతీ స్వాములవారి గ్రంథములను చూడనేలేదనియు, మూర్తిగారి అగ్నిహోత్ర లాభముతప్ప మఱియే గ్రంథములను గాని చదివి యుండలేదనియు, విశదమగుచున్నది. వారు నాకు వ్రాసిన లేఖలో సయితము మూర్తి గారినిగురించి అనార్యాది శబ్దములు ప్రయోగించినందున శాస్త్రిగారికి సభ్యత్వము తెలియదని సూచితమగుచున్నది. స్త్రీలను గుఱ్ఱములతో రమింపజేయు యాగపద్ధతి యజుర్వేదమున గలదని పశువధ గలదని మూర్తిగారు కల్పించిరని వ్రాయుట చూడగా, మహీధరభాష్య మెఱుంగరని విస్పష్టమగుచున్నది. మూర్తిగారు విగ్రహారాధనను దూషించిరని వ్రాసినది చూడగా శాస్త్రిగారు శంకరాచార్యుల గీతాభాష్యమును గాని శ్రీమద్భాగవతమునుగాని జూచియెఱుంగరని తెలియుచున్నది. ఈశ్వర లక్షణమునకు విరోధముగ వానికి మంత్రిపురోహితులు గలరనియు సాకారుఁడనియు వ్రాసినందున శాస్త్రిగారు న్యాయదర్శనము నెఱుంగరని తెల్లమగుచున్నది. శాస్త్రిగారిప్రశ్నల కనేకములకు మూర్తిగారి గ్రంథములందే ప్రత్యుత్తరములున్నవి.

మహమ్మదీయులు హిందువులను సంధ్యాదులను గురించి ప్రశ్నించినందుకు మహమ్మదీయ మతపరిక్షయను గ్రంథమందు ప్రత్యుత్తరములున్నవి. దానిని చూచినట్లు శాస్త్రిగారు వ్రాసిరి. చూచియునటువంటి ప్రశ్నలనే తమ గ్రంథమందు వ్రాసినది చూడగా హరముచలముగలవాడని తోచుచున్నది. తైత్తిరీయ బ్రాహ్మణమందు ( అ 7) "బ్రహ్మణే బ్రాహ్మణ మాలభతే క్షత్రాయ రాజన్యం" ఇత్యాదిగ బ్రాహ్మణ వర్ణ దేవతకు బ్రాహ్మణుని, క్షత్రియ దేవతకు క్షత్రియుని క్రమముగా నరబలి విధానము చెప్పబడియున్నది. శతపథ బ్రాహ్మణమందు సయితము నరబలిని గురించి వర్ణింపబడియున్నది. ఇదంతయు మూర్తిగారు కల్పించిరని వ్రాసినదిజూడగా శాస్త్రిగారు అనధికారచేష్ట చేసిరని చెప్పవలసి వచ్చినది ఇప్పుడనేక చోట్ల పశువధయాగములు జరుగుచునేయున్నవి, హిందూపురమునందు సయితము గొర్రెమేకలను జంపి యజ్ఞము చేసినది చూచినవారు గలరు. ఇవిఆర్యులు కల్పించిరో మరెవరు కల్పించిరో శాస్త్రిగారు యోచించిలేదు. పశువధచేసి యాగముచేయనివారును జంతుబలి యియ్యనివారును బ్రాహ్మణులుగారని శాస్త్రులవారి శాఖవారును వారికి పరమాప్తులును వారి స్తోత్రములకు పాత్రులైన వారగు పాకయాజిగారు ప్రచురించిన కరపత్రమును నేను జూచియున్నాడను. ఇప్పుడీ మహాపాతక కర్మలను కల్పించిన వారెవరని చెప్పవలెను? కథ

మాట వ్రాసెదను. సీతారామశాస్త్రిగారి గ్రంథమును ప్రచురించుటవలన శ్రీమదార్య నారాయణమూర్తిగారి కీర్తి కెంతమాత్రము హానిలేదనియు శాస్త్రిగారు "శాస్త్రాణ్యధీత్యాపి భవంతి మూర్ఖాః" యను వాక్యమునకు గురియైరనియు నానిశ్చితాభిప్రాయము. (లక్ష్మీకాంతాచార్యులు, పరిగి.

# తిరస్కారము.

అనార్య మతఖండనమను పేర నిటీవలఁ బ్రకటితమయిన, చిన్నని వచనగ్రంథప్రతి యొకటి మాకు లభించెను. మేము దీనిని బూర్తిగాఁ జదివితిమి. ఇది ఖండనగ్రంథము కాదు. సద్భావమును మనస్కరించి గౌరవింపఁదగిన యంశ మొకటియు నిందుఁ గానబడదు. పరశ్రేయోభిలాష తత్పరతచే, మహోదారభావమున వెలువడిన భాషణము లిందులేవు, కాని పరాభవ క్లేశజనిత క్రోధమున కుపశాంతిగ, నసూయావేశమున నెడలిన దూషణములున్నవి. అందునకయి గ్రంథకర్త దీనిని గల్పించెను. కనుక నిది యప్రతిష్ఠకార్యమని, మేము రూఢిగఁజెప్పుచున్నాము. ఇందలి నిందావచనముల నిచటఁ బునశ్చరణ మొనరించుట మాకు ధర్మముకాదు. గ్రంథకర్త దుర్భాక సీతారామశాస్త్రి అనం-

తిపురమండల వాసుఁడు. బుక్కపట్టణ వాస్తవ్యుఁడు. పేరువలన గృతికారుఁడు బ్రాహ్మణుఁడని తెలియుచున్నది. కాని నిజమయిన బ్రాహ్మణుఁ డిట్టి దుష్టభూయిష్టగ్రంథమును వ్రాయ దొరకొనఁడు, అతని పావనలేఖిని యిట్టినికృష్టపథమున నుఱుకఁజాలదు అట్లగునేని యట్టిమనుజునందు బ్రాహ్మణశబ్ద మన్వయించునని యేసత్పురుషుఁడు నుడువ సాహసింపఁడు. బ్రాహ్మణుఁడు భూలోకదేవుఁడు. ఆమహనీయుని పవిత్రరచన, మిక్కిలియు నొప్పిదమయి యుండును. అయ్యది పక్షపాత భావరహితమయి, మంజులపదపుంజమయి, యమృతప్రాయమయి, హితదాయకమయి, వాచకుల నొక్కమ్మడి న్యాయమార్గమునఁ జొన్పియుండును. ఈగ్రంథ మట్లులేదు. ఇందలి వాక్యసరణి, ఛండాలుని కఠోరవచనజాలమునకంటెను విషప్రాయమయి, యహితకారణమయి, సుజనులకువిముఖతయును విషాదమును గొల్పుచున్నది. నిశ్చయముగ నిది పఠనయోగ్యముకాదు. మఱియు స్పృశించుటకయిన నర్హమయినదని మేము తలంపఁజాలము. దీనిని విషతుల్యముగ భావించుట యుక్తము. స్వధర్మములను స్వకర్మలను వదలి నటించవలెనని కాబోలు, కృతికారుఁడు సెలవిచ్చియున్నాడు. స్వధర్మ స్వకర్మ లనునవిట్టివనుటను మాత్రము అందు వ్యక్తీకరించి యుండలేదు. పరనిందయే పరమధర్మమును అట్టి ప్రకాచరణ (గ్రంథకరణ) మే స్వకర్మయుఁగల, యీకృతికర్తానే

స్వధర్మ స్వకర్మల కాదర్శపురుషునిగఁ దీసికొనుట యోగ్య మను
కొన్నను వాని కతను విముఖుఁడుగ నుండలేదు. ఆర్య నారా
యణమూర్తిగారివి "శూద్రకూత" లని వీరు శాసించిరి. ఇట్టి
యశ్లీలవచనములు బ్రాహ్మణ విశ్వ భ్రాతృత్వభావమునకును,
సర్వజీవదయాపరత్వమునకును, దార్కాణములగునా? "శూద్ర
కూత" లని నుడువుటయం దెట్టి భావౌచిత్యమును, స్వారస్య
సంపదయు, నెంతటి యౌదార్యమహిమయు, వెలయునో, బ్రా
హ్మణ లక్షణమున కిది యెంతవఱకు లక్ష్యమగునో, సత్పురుషు
లూహింపఁగలరు. గ్రంథమంతయు నింతకంటెనికృష్టమై హేయ
మయిన దూషణపదములతో నిండియున్నది. అహా! ఉత్తమ
బ్రాహ్మణుని పవిత్ర వదన సరోజమున, నిట్టి తిరస్కార భావ
గర్భిత నిందావచస్సమన్విత కలుషవిషము, స్రవించియుండునా?
బ్రహ్మస్వరూపాను సంధానపరుఁడును, విశిష్టాద్వైది గుణాలంకృతుఁ
డును, దైవజ్ఞుఁడును, అగు ఆమహాదీయునకు, ఆవినిర్మల స్వాం
తునకు, అట్టి పరహితాచరణ పరాయణునకు, అటువంటి బ్రాహ్మ
ణునకు ఈకలుషహృదయయుఁడు, ఇట్టి పరనిందాపరాయణుఁడు,
ఇటువంటి పచ్చిబూతుల బాఁపఁడు, తుల్యుఁడని మేము భావిం
పఁజాలము. ఈపవిత్రకావ్య నిర్మాణమునకయి యీశాస్త్రి
సల్పిన యీపరిశ్రమ, స్వజాతియందలి మాంసాహార మదిరాపాన
మూర్ఖుల, అతిచారుల, గతిచెడి తిరుగుచు పతితులగుచుండు

సోదర జనుల, యవినీతిని దొలగింపc జూపియుండినచో, కొంత వరకయినను హితదాయకముగనుండి యుండునేమో. వీరింకను ద్వితీయభాగమును విపులముగా వ్రాయనున్నారcట? ఇట్టియ ప్రతిష్ఠ కావ్యమునకుc దోడుచూపిన పురుషులునున్నారు. వారి నామములు గ్రంథాంతమునc గొన్ని యగుపడుచున్నవి. కృతి కర్త తద్గ్రంథ ప్రాచుర్యమునc దమకెంతయో వన్నెదెచ్చునని భ్రమించి, పాప మీయమాయకులే కల్లతొడుగునc గాలిడిరి కాcబోలును. కృతికారుcడు కపటచిత్తుడయి యతని నీచోద్దేశ మును లోకమునకు వెల్లడించి, తమ కప్రతిష్ఠ తెచ్చెననియు, నిట్టి దుష్టగ్రంథములకు ధనము దగ్ధముచేయుట, తమ యుదార శీలమును పాపాల జ్వాలలయం దాహుతి నొసర్చుట వంటి దనియు, నిcకముందయినను వీరు గ్రహించుట క్షేమకరము. మే మీయసద్గ్రంథమును మా మనఃపూర్వకముగc దృణీకరించుటయే కాక, మున్ముందిట్టి కుత్సిత రచనలకు దొరకొని లోకవంచనము నకు బాల్పడి, యపకారములకు గుఱికాకుండుటకై శాస్త్రిని మఱి, మఱి, హెచ్చరించుచున్నాము. (హితాభిలాషి, శిరిపి. ఆంజనేయులు.) (క్రియాశక్తి నొడయరుసమాజము ధర్మవరము.)

---

బుక్కపట్టణము, దుర్భాక సీతారామశాస్త్రిలకొక

# విజ్ఞప్తి

—————:o:—————

తా మిటీవల ఆర్యధర్మోపదేశకులగు హిందూపురం ఆర్యనారాయణమూర్తిగార్పై యధర్మముగ దాడివెడలి మూర్తిగారి సత్యప్రదర్శకములగు గ్రంథముల నీర్ష్యచే ఖండించుటకు ముందువచ్చి మూర్తిగారి గ్రంథములపై తాము చక్కగ జదివి వానిలోని సత్యముల నెఱుంగక యసంబద్ధప్రలాపములచే మూర్తిగారిని తూలనాడియు, అసత్యప్రకటనముల జేసియు, తర్కనైపుణ్యమునకు విరుద్ధములగు ప్రశ్నములవేసియు, ద్వేషాసూయాజన్య దూషణవాక్యముల వ్రాసియు అనార్యమతఖండనమును నీతియుక్తిదూరమగు పొత్తమును విత్తవ్యయమునకోర్చి ప్రచురించుటకు ముందొచ్చి ధీవరుల తీవ్రతరములగు విమర్శనములకు పాత్రమై పలుఖండనముల నందుచుండు తాముకు విజ్ఞాపనము నీపత్రికామూలమున నర్పించుకొనుట అవశ్యమని ముందువచ్చితిని. మిత్రమా! మనమూఢభక్తి యనాచార భూయిష్ఠులగు (బ్రాహ్మణ) సోదరులచే పూర్వముండి యనుష్ఠించబడుచుండిన యసంఖ్యాకములగు జీవహింసల, సురాపానముల, నతిఘోరయజ్ఞముల, వేదవిరుద్ధకర్మముల, నొకమారు తలంచుసరికి మ

నము వారియందు ప్రబలియుండిన అనాచార్యచర్యల కెంతో దుః ఖించుటకు అవసరము గలుగలేదా? అట్టివారి మూఢాచారముల ఖండించి వేదోదిత సత్కర్మాచరణముల నాచరణమునకుదెచ్చి వేదమతమునకు వన్నెతెచ్చిన ఆర్యసమాజములయెడ మనము జూపవలసిన కృతజ్ఞతకు మేరగలదా? ఆర్య (మత) సమాజము లే బుట్టకున్న మనదేశమునందు వేదమతమేమిగతి యందియుం డునో తామూహించితిరా? మనమాఢ్యపరంపరల బారదోలుట కై కంకణముగట్టుకొని తన యావజ్జీవితమును ధారపోసిన శ్రీ మద్దయానంద సరస్వతీస్వాములు మనకు వందనీయులుగారా? అట్లే మనయాంధ్రదేశమునకు ఆర్యమత ప్రచారమునందు మన కు మార్గదర్శకులగుచుండు నారాయణమూర్తిగారును మనకృత జ్ఞతకు పాత్రులనుటకు యిసుమంతయు సందేహముగలదా? అ ట్లుండ తాము పైవిషయముల నావంతయు నాలోచించక వేద విరోధములగు అనాచారకర్మముల చిరకాలానుష్టానాభిమానము చే సత్యమని సమర్థించుటకుగాని సత్యాసత్య వివేచనాజ్ఞాన శూన్యులంబోలె మూర్తిగారి వేదవిహిత సత్యప్రకాశకములగు సద్గ్రంథములను ఖండించుటయు, మూర్తిగారిని శ్రీమద్దయానం దులవారినిపై తము దూషించుటయు, తమకు కళంకప్రాయమగు చున్నదిగదా? మనుష్యులలో కొందరుమూఢులు లోకతెగినజం బుకమువలె తమతప్పులనుతప్పులని తామెఱింగియు అన్యులకు

ఒప్పులని సమర్థించిజెప్పువారుగలరు. వీరిచేతనే దేశమునకు గొప్ప ముప్పువాటిల్లును. బుద్ధిమంతులన్ననో కారణాంతరములచేజరిగిన తమ తప్పుల నితరులముం దొప్పుకొని యితరుల నాతప్పుల జే యకుండునట్లు హెచ్చరించగలరు. తామా రెండవపక్షమువారిని జేరక జీవహింసాది నీచకృత్యముల సమర్థించు పౌరాణిక బ్రాహ్మణుల పక్షము వహించుట మిక్కిలి విచారకరము. మూర్తిగారియొక్క గ్రంథములను సమగ్రముగ మూమ్మార్లు జదివి జూచి యున్నాను. అందులో నొక్కపంక్తియైనను నొకవిషయమైనను వేదవిరుద్ధముగను న్యాయదూరముగను అనుభవ శూన్యముగను గనుపడలేదని నేను నొక్కి వక్కాణించగలను. తాము సైతము న్యాయైకదృష్టితో మూర్తిగారి పరిశ్రమను తిలకించినచో నీసత్యము తమకు విస్పష్టముగ వెల్లడియగుననుట నానమ్మకము. గాన ఇకమీదయినను తమపొరబాటును దిద్దుకొని ఇట్టి దూషణప్రదములగు గ్రంథజాలముల ప్రచురించి ధీవరుల తీవ్ర ఖండనములకు పాత్రులుగాక సత్యమునకు విధేయులై తమ సుముఖభావమును పత్రికాముఖమున వెల్లడించి నాదు ధన్యవాదముల నందుకొండని కోరుచున్నాను. అట్లులేక వితండావాదములకు దిగినచో వివేకులముందు తమ విచారశూన్యతను వెల్లడించిన వారగుదురనియు హెచ్చరించెదను.

(న. వెంకటరమణయ్య, వడగంపాళ్యం, సేలంజిల్లా.)

## సూచన.

కొందరు వ్రాసిన యంశములు చాల దీర్ఘములై యున్నవి. గనుక వానిని సంగ్రహించి ప్రచురించుచున్నారము సం॥

# శాస్త్రిగారి ప్రశ్నలకుత్తరములు.

———:o:———

(1) మాకుఁగలిగిన స్వానుభవమును నీకు చూపుటెట్లు? నీకనుపునొప్పిని కంటితో చూడగలవా? ఆత్మానుభవము కంటికి యగపడునా? నీప్రశ్న యోగ్యముకానేరదు. సురాసముద్రములో, సుగంధద్రవము వలె నిదివరకు హింసారూపకమైన తామసయజ్ఞముచే నీయింద్రియములన్నియు చెడియుండగా నిష్పాడార్యులయొక్క సాత్వికయగ్నిహోత్రమువలన నీకు లాభ మెట్లు కలుగును? ఇది యసాధ్యరోగము.

(2) నీవింతవరకు సంధ్యలో నేదేవునిగూర్చియు ధ్యానించినట్లులేదు. "యేదేవునిగూర్చి ధ్యానించవలెను?" అని యడిగితివి. దేవత లెందరని మేమడుగవలసివచ్చెను. నీమతమం దెవరు దేవతలో నీకే తెలియును. సంధ్యామంత్రములు సూర్యసంబంధమని ఆర్యు లెచ్చట చెప్పియున్నారు? మీతాత చెప్పినది ఆర్యుల కెట్లు ప్రమాణమగును? దేనిని బ్రాహ్మోపదేశమందు

రు? నీ కింకను ఉపనయనమందలి యుపదేశరహస్యము తెలియ దు. ఒక యార్యబ్రహ్మచారి పాదములకుఁ బ్రణమిల్లి తెలిసికొనుము. నీయవివేకము తొలఁగును.

(3) మంత్రములలో సాకారము కల్పించిన దెవరు? నీ పితామహ ప్రపితామహులు కడా? దానితో ఆర్యుల కేమి సంబంధము? ఈశ్వరునకు సాకారము కల్పించిన మరియొక యీశ్వరుఁడెవరు? సాకారము కల్పితమని నీవే వ్రాసితివి గనుక నిరాకారము సిద్ధమైనది. నీప్రశ్నయొక్క యసంగతము చూచితివా?

(4) స్వస్తి యెవరికని చేయుచున్నావు? చేయడములేదా? అట్లయిన నీవు బ్రాహ్మణుఁడవుకావు. చేసెదవా? తెలియకనే చేయువాఁడు కేవల మవివేకియయ్యెను. ఆర్యుల పాదసేవ చేసి తెలిసికొనుము.

(5) వేద శాస్త్ర పురాణము లన్నియు సమమని నీ వనుచున్నాడవు. పరిక్షిత్తుయొక్క మరణము భారతమం దొకవిధమునను భాగవతమం దొకవిధమునను గలదు. రెండును నిజమనువాఁడెంతటి మూర్ఖుఁడవవలయును? స్వర్గీయమహాసభ యను వ్యాసమునకు ప్రత్యుత్తరము చెప్పుటకు నీవెన్నిజన్మము లెత్తినను సాధ్యముకాదని నమ్ముము. "వేదైర్విహీనాః ప్రపఠంతి శాస్త్రం, శాస్త్రేణహీనాశ్చ పురాణపాఠాః" యనునట్లు పురా

ణనాచక్షుడగు నీకు వేద శాస్త్రము లేమితెలియును? గనుక గనుక నీవే, అగ్నిహోత్రమును, దాని మంత్రములను, సంధ్యను వెక్కిరించుచు నాక్షేపించుచు నీదోషము నార్యులపై యారోపించుచున్నావు. ఆర్యులకు వేదము స్వతఃప్రమాణము. ఇతర గ్రంథములు పరతఃప్రమాణములని నీకెంతచెప్పినను గ్రహింపవేల?

(6) ఈప్రశ్న నీమూర్ఖతను చక్కగ వెల్లడిచేయుచున్నది. పరతఃప్రమాణమగు భారతమంతయు నార్యుల కెట్లు ప్రమాణమగును. నీకంతయు ప్రమాణమైనచో నొక్క స్త్రీకైదుగురు పతులుండుట మీయింట గలదేమి? భర్త పరదేశమునయున్నప్పుడు భార్య పరపురుషుని పొందుకోరగా వాడామెను పొందకున్న భ్రూణహత్యాపాపమువచ్చునను భారతమందలియంశము మీలో నాచరణమందున్నదిగదా? మీలో లేదన్న భారతమును కొంత త్యజించిన పాతకము మీనెత్తిన బెట్టుకొంటిరి. గీతలో "ఆదిత్యానామహంవిష్ణు" యని గలదు. శతపథం 14 కాండం 16 ప్రపాఠకం 6 కాండికలో "కతమ ఆదిత్యా ఇతి" యను వాక్యములో ఆదిత్యులలో విష్ణునిపేరు లేదు. ఆదిత్యులలో నేను విష్ణువని చెప్పిన వాక్య మెట్టునిజమగును? "ఇంద్రియాణాం మనశ్చాస్మి" యన్నట్లు మనస్సు యింద్రియములలోను, "నక్షత్రాణామహంశశీ" యన్నట్లు చంద్రుడు నక్షత్రములలోను చేరియుండుటకు శాస్త్రప్రమాణము చూపగలవా? పద్మపురాణమం

దు విద్యాదేవికి (21) ఇరువదియొక మంది పతులుండిరి. మీా స్త్రీలలో నెందరికి యీాప్రమాణము ననుసరించి పెండ్లి చేసియున్నారు? పనికిమాలిన ప్రశ్నలను వేసి పామరులను నవ్వించిన వాఁడు పండితుఁడగునా? ఇందువలన నీకు శాస్త్రియనుపేరు సర్వథా చెల్లదు.

(7) ఈప్రశ్నలవలన నీకు మంత్రవినియోగమన నేమో తెలియదు. అబ్రాహ్మణున కెట్లు తెలియును? బ్రాహ్మణుఁడైన వాఁడు శంకింపఁడు. వైదికఇతిహాసార్థనిర్ణయ మను గ్రంథమున జూచుకొనుము. బ్రాహ్మణగ్రంథములను చూడుము.

(8-9-10) ఈప్రశ్నలకు హోమపద్ధతియను గ్రంథమును, శ్రీమద్దయానంద వేదభాష్యములును, సంస్కారచంద్రిక యను గ్రంథమును చూడుము. నీవెన్ని భాష్యములు చూచి యున్నావు? నిశ్చయముగ చెప్పగలవా? అర్థము వినియోగముల భేదము నీకింకను తెలియలేదు. అర్థవినియోగములు వేరు వేరైనప్పుడు నీప్రశ్నలేమగును? ఈప్రశ్నలు మీాగురువుల నడిగినచో నీకు తప్పక బహిష్కారపత్రిక వచ్చును.

(11) ఈప్రశ్న వేయునప్పుడు నీదృష్టికి భ్రష్టత్వము వచ్చిన కారణమేమి? "యజుర్వేదభాష్యము ౨౧ అధ్యాయము ౩లవ మంత్రమునకు భాష్యముచూడవలయునని అగ్నిహోత్ర

లాభమందే వ్రాసియుండలేదా? అప్పును తల తిరుగుచుండె గాబోలు?

(12) గృహ్యసూత్రములు, యజుర్వేదభాష్యము సంస్కారచంద్రిక, సంస్కారవిధి, హోమపద్ధతి, యను గ్రంథములను చూచుకొనుము. వైదికకర్మలలో నీకు అక్షరాభ్యాసమైనను లేనట్టున్నదే? ఆపోశనమన నేమి? మార్జనమన నేమి? పూర్ణాహుతి యనగా నేమి? ఇత్యాది ప్రశ్నలకుత్తరము యూరక లభింపవు. మూర్తిగారి పాదసేవజేసి వారిదాసానుదాసుడై వర్తించినచో లభించును. మిథ్యయగు ఫలశాస్త్ర గుప్తముల దెలియవలయునన్న గురువనుగ్రహము కావలయునని నీవు శ్రీ లక్ష్మీకాంతాచార్యులకు వ్రాసితివే. వేదాది సత్యశాస్త్రములకు గురువనుగ్రహింపక గుప్తము లెట్లు తెలియును? కురూపీ! యేల పుట్టితివన సురూపుల వెక్కిరించుట కన్నమాట నీయందు సార్థకమయ్యెను.

(13) దేవగణ పితృగణములనుగురించి ఈశ్వరరహస్యసారము ద్వితీయభాగములోగల త్రిదేవ నిర్ణయము, పితృగణము-రాత్రి 104 పేజి. పితృగణము- దక్షిణాయనము, మొదలుకొని చూడుము. పితరులనుగురించిన సర్వసంశయములు నివారణమగును. దేవగణములేమో వివరముగ దెలియును. నీ య

జ్ఞానాంధకారము తొలగును.

14. ఈప్రశ్నకు యజుర్వేదభాష్యమును చూడుము. నీవు అనృతమును సత్యము చేయగలవు. కొండలు ముంచ్చు కాలడమగ్నిహోత్రియైన పుస్తకము అసత్యముగంపవెను యుండలేదా? ఓహో! నీవంశమందు బ్రహ్మచర్యము లేదేమి? నీబూతు పుస్తకములోని "సదరీ—వగైరా" పదములవలెనే మాగ్రంథమందలి సాంకేతికములు గ్రహింపవేల? మాకర్మలు మాగ్రంథముల వలనను నీకర్మలు నీగ్రంథమువలనను అందరికి తెలియుచున్నవి. నీజాబులలోని "రామచంద్రప్రసన్న" శబ్దమువలననే నీదేవుడును, నీకర్మ, నీబ్రాహ్మణత్వము, నీవైదికజ్ఞానము వెల్లడియగుచున్నది.

15. పరీక్షచేయుమార్గము నీకు తెలియదు నిజమే. న్యాయదర్శనపరిచయమును చూడుము. పాపాత్ముడుగదా—దానిని పోగొట్టుకొనవలయును? ఈప్రశ్నలో నాలుగువేదములు మాకుచెప్పితివి. నీవు వేదబాహ్యుడైతివి. వేదములులేని నీవు ఆర్యుడనుకొంటివి. నాల్గువేదములుగల మమ్ములను అనార్యులంటివి. మీవేదమునుగురించి తైత్తిరీయశాఖోత్పత్తియను వ్యాసమునుచూచియు నిజముతెలియలేదా? మరల ప్రకాశికనత్తిమూర్తిగారి వ్యాసమును పఠించుము. ఇంకను సంశయమున్న ఉపనిషదార్యభాష్యమును చూచుకొనుము.

16. తూర్పున కింద్రుఁడధిపతియని పామరులుచెప్పుచుం డ వినియుంటినికదా? ఇప్పుడు అధర్వభాష్యమును వై దికకోశ మును జూడుము. పండితులేమిచెప్పెదరో వినుము. నీబుద్ధిమాంద్యము తొలగును.

(17-18) ఈరెండుప్రశ్నలలోని సందేహము తీరుటకు సంధ్యోపాసనమను చిన్నగ్రంథమును, హోమపద్ధతి యను గ్రంథమును చూడవలెను. తెలివిగల బాలుఁడు సయితము సూర్యోదయమువలన దిక్కులు తెలిసికొనగలఁడు. నీగ్రంథము 29వ పేజీలో అంతరంగమున నేమో మూర్తిగా రాచరించుదురని వ్రాసితివే అది నీయందిప్పుడు బహిరంగమయ్యెను. నీకు దిక్కులే తెలియవు. నీవు మద్యపానము చేయుచుండుటకు ప్రమాణము లభించినది.

(19) త్రిదేవనిర్ణయము సత్యార్థప్రకాశకలో దేవ విష యమెఱుంగుము. ఓమూర్ఖ శాస్త్రీ! మానవులు పూజింపని పదార్థములు గలవా? మనము పాదరక్షలను తుడిచి శుభ్రము చేయుచున్నారము. దీపమును తుడిచి శుద్ధము చేయుచున్నాము. గుడ్డల నుతుకుచున్నాము. శరీరమును కడుగుచున్నాము. పూజయ వ సపర్య-గౌరవము. పూజించుటయన గౌరవించుట. దేని నేవిధ మున పూజించవలయునో దాని నావిధమున పూజించుచున్నార

ము. విగ్రహారాధన మనగానేమి? విగ్రహమును శుద్ధముచేసి యలంకరించుట. దానిని నీగ్రంధమునందే నీచేతితోడనే విగ్రహారాధనమని వ్రాసితివిగాని ఈశ్వరారాధనమని వ్రాయకపోతివే? నీవెంతటి యజ్ఞానివో నిన్ను నీవు చూచుకొనుము. విగ్రహారాధన ఈశ్వరారాధనలు రెండును వేఱువేఱనియింకనైన గ్రహించుము. ఇదేగ్రంధమందలి శ్రీసదానందసీతారామయోగీశ్వరుల లేఖనము లో నుదహరించిన శంకరగీతాభాష్యమును జూచినచో నీవు గురుద్రోహివని నీకే స్పష్టమగును.

(20) ఈప్రశ్నకు 13వ ప్రశ్నకిచ్చిన యుత్తరమే చేరియున్నది. నీకు పశుయాగము వలన పాపమును దానిఫలమగు దుఃఖమును వృద్ధియగుటకు సందేహములేదు.

(21-22-23) ఈప్రశ్నలకు క్రమముగా సంస్కార చంద్రికలోని సామాన్య ప్రకరణము, వేదమర్యాద, భాస్కరప్రకాశలో తృతీయ సమల్లాసమండనము, సత్యార్థప్రకాశిక మూడవ సముల్లాసము, చూచుకొనుము. ప్రాణాయామాది యోగరహస్యములకు ఆర్యుల మైత్రియేఅధికార యోగ్యమగుచున్నది. గురుమంత్రము (గాయత్రి)లో ఈశ్వరప్రార్థన యున్నందువా; లేదందువా? అది సూర్యమంత్రమని మీతాతలు చెప్పినారు. గనుక నీవు సూర్యుడే. ఈశ్వరుడని సూర్యనమస్కారములు చేయుచు

చున్నావు. నీగురుమంత్రము ఫలితసంబంధమగు భృగుప్రశ్నలో ని "ఓం ఏం హ్రీం క్లీం శ్రీం వటుకభైరవాయ ఆపదుద్ధారణా య సర్వవిఘ్న నివారణాయ, మమరక్షా కురుకరుస్వాహా" యనునది గదా?

(24) స్వరసందేహమునకు "శావర" మను గ్రంథమును పఠించుము. వేదమంత్రములకు స్వరము తెలియునని నీకెంతగర్వమేల? ఆర్యవిద్యార్థులవద్ద వారికి శిష్యుడవై నేర్చుకొనుము.

(25) అథర్వశబ్ద మెట్లున్ననేమిగాని, మూర్తిగారును దయానందులు. యీవిషయమై వాదెంచినని మీరెచ్చట చూచితిరి? నీగ్రంథమందలి మిథ్యలెన్ని యనవలెను? నిన్ను మిథ్యా వాదీ! యని పిలువవలసి వచ్చెను.

(26) దయచేసి సంస్కారచంద్రికను శ్రద్ధతో చూడుము. అందరికి బుద్ధిచెప్పెదు నీకేల బుద్ధిలేదు? ఇదేగ్రంథమందలి సత్యా సత్య నిర్ణయమును పఠించుము. నీపేరు మూర్తిగారికెట్లు తెలి సెనో లజ్జకలిగి యోచించుము. కాలుద్రొక్క కారులుప్రేలిన దెవరో కనుగొనుము. శబాష్! "నామమే లేని దేవునకనంత నా మములను అనార్యులు కనుగొనిరా?" యని ఆశ్చర్యపడితివి. "నామమేలేని దేవుడు" అని వ్రాసితివే- దేవుడనునది నామము కాదా? నామములేని యూర్ధ్వపుండ్ర మెట్లున్నది. దూమాట

భూషణ తిరస్కారములనేమో నీకు తెలియదు. ఆర్యగ్రంథము లందు చూచి తెలిసికొనుము. దేవునికి సాకారముకల్పించి పేరు ను దీసివై చితివేమి?

27. గౌతమసూత్రములు 550 గలవు. దేవునికిపేరు లేని సాకారమును కల్పించినట్లు వీరితాతగారు గౌతమరచితమగు న్యాయదర్శన సూత్రములకు విరోధముగ, యాత్రిపేరిట, గోపీ చందనోర్ధ్వపుండ్రధారణ సారగ్రావ శిలాపూజలు కల్పించిరి కాబో లు? మరియొకరు "ఊర్ధ్వపుండ్రం త్రిపుండ్రంచ వర్తులం చతురస్ర కం అర్ధచంద్రాదివాలింగం వేదనిష్ఠాలధారయేత్" అని పురాణ కర్తలు వ్రాసిరి. బూజుదులిపి పురాణములను శోధింపుము. నీవు వేదబాహ్యుడవని తెల్లమగును.

(28) మనుస్మృతి యంతయు నీకు స్వతఃప్రమాణమైన ప్పుడు "హృద్యానిచైవ మాంసానిపానానిసురభీణిచ" (తృ-227) ఇత్యాది ప్రమాణముల వలన నీవు మద్యపాన మాంసభక్షణ ములు చేసితీరవలయును, నీకలమే నీకు సాక్షియైనది. ఇందువల ననేకాబోలు? ఆర్యులంతరంగముగ త్రాగుదురని వ్రాసితివి.

(29) ఫలితమునకు స్మృతిప్రమాణము చూపకనే, యు న్నదని గప్పాప్పకముగొట్టి ప్రయోజనమేమి? శ్రీలక్ష్మీకాంతా చార్యుల వ్యాసము చూడుము.

(30) మీయింటిలో హోమముచేయునప్పుడు ముంగిస మొదలగు జంతువులు వచ్చుట కాశ్చర్యమేమి? మీయాగములందు ముంగిమొదలగు మాంసభక్షక జంతువులు తప్పక వచ్చును. ఇట్టిస్వానుభవము ఆర్యులకు లేదు.

(31) మూర్తిగారి యారోగ్య భాగ్యమే వారికి స్వానుభవము. ప్లేగు మొదలగు సాంక్రామిక వ్యాధులు వ్యాపించినప్పుడు వారు స్వగృహమును విడువక అగ్నిహోత్రము చేయుచుండుట హిందూపురవాసు లందరికి తెలియును. మీబోటి దుర్భాగ్యులకు సద్భాగ్యమెట్లు స్వానుభవమగును?

(32) శతపథము తైత్తిరీయములు వేదములని ఆర్యులు నమ్మలేదు. నీవు యేయేభాష్యము లెన్ని చూచినావు? తైత్తిరీయ శాఖవారిప్పుడు పశువధయాగములు యేభాష్యము ననుసరించి చేయుదురు? భీమసేన ప్రశ్నోత్తరీ, వేదమర్యాదా అను గ్రంధములు పఠించితివో తెలియును. ఈగ్రంధములోనే శ్రీయుత హనుమంతరాజుగారి వ్యాసములో మహీధరభాష్యమును చూడుము. నీవు చూడనిదానిని ప్రపంచములో లేదని చెప్పుదువా? మహీధరభాష్యమును గలదని యిప్పుడైనను తెలిసికొనుము. ఎవరెవరు యేయేవేదములకు భాష్యము వ్రాసిరని నీకు తెలియదు. వృథా గర్వపడుచున్నావు. శ్రీమద్దయానంద సర

స్వతీ స్వాములవారి ఋగ్వేదాది భాష్యభూమికనైన పఠించుము అయ్యా శాస్త్రీ! ఆర్యులను తిట్టితిట్టి చండాలురై తిరిగాని వానిని దిద్దవేక పోతిరి. గురుమేధ నరమేధములు మీారుచేసి వారినెత్తిన బెట్టితిరి. పాలలో కారమువేసిన పాకమురాదు; కారములోపాలు పోయుమన్నట్లు సితమును అసితముఁ జేసియు ప్రయోజనము లేకపోయెను. ఏమయా? నీచగాయ! కల్లుద్రాగుటకు ముహూర్త ములు బెట్టితిరి. జంతువులజంపి యాగము చేయుమంటిరి. అది కూడదన్నందున ఆర్యులను తిట్టి, గప్పాలుగొట్టి, బడాయిని ఉడాయించి, డోలువాయించి, బుట్టకాయనూది, పాములవాని మాయలుచేసి గడబడాధ్యాయము వ్రాసితివి. బుడబుడక్కల వాడు గద్దెజెప్పినట్లయ్యెను. శ్రీదయానందులు 40000 వేల పుటలు వ్రాసిరి. నీవు 40 పేజీలలో ఖండించితివి. భలా! వితం డావాద మదవేదండ తాండవం బాడుచు నార్యులపై తొడగొట్టి బుట్టలోని బట్టపాముల బారవిడిచితి రేల? ఏమిఫలము?

H. V. Murti. సబ్ రిజిస్ట్రార్, చిక్కమగళూరు.

# ఆరబిమతఖండన సమాలోచన.

---

మన దేశమిందిప్పుడు మతవిషయములందును గ్రంథము లను గురించియు పరిశోధనలు జరుగుచున్నవి. వేదసంహితలు

నాలుగుండ భృగుసంహితేత్యాది నవీనసంహితలును, శాస్త్రము
లారుండగా సాముద్రిక-మక్షికాపతన శాస్త్రాది క్రొత్తశాస్త్రము
లనేకములు బైలుదేరియున్నవి. ప్రాచీనగ్రంథము లనేకములు
ప్రక్షిప్తములై యున్నవి. భాష్యములు భిన్నభిన్నములై యున్నవి.
మతమతాంతములు, ఆచారభేదములు, అర్థానర్థములు, నానా
శాఖలు, కలిసియున్నవి. దుర్భాక సీతారామశాస్త్రిల వారూ!
"అశ్వస్యాత్ర హి శిశ్నంతు పత్నీగ్రాహ్యం ప్రకీర్తితమ్" ఇత్యాది
శ్లోకములెవరు యెందుకుగాను రచించిరో మీకు తెలియదు. కన్ను
లున్న యంధులవలె ఆర్యులను తిట్టుట కుపక్రమించితిరి. ఇప్పుడు
పశువధయాగములు కెవరిభాష్యము లాధారము లనుకొంటిరి?
మీపాకయాజిగారే యాధారమున పశువిశసనము బ్రాహ్మణధర్మ
మని కరపత్రములను ప్రచురించిరి? భగవద్గీత 18వ అధ్యాయము
22వ శ్లోకమునకు శ్రీయాదిశంకరులు "దేహపరిమాణో జీవ
ఈశ్వరో వా పాషాణదార్వాదిమాత్ర ఇత్యేవమేకస్మిన్ కార్యేసక్త
మహేతుకం హేతువర్జితం" అని ప్రతిమాదులందు దైవభావము
ను, సాకారేశ్వర ధ్యానమును తామసమని హేత్వాభాసమని
భాష్యమును వ్రాసియున్నారు. మీరుశంకరశిష్యులై యుండియు
గురువునకు పంగనామములుబెట్టి గురుద్రోహులై తిరేల? "చం
డాలోస్తు సతుద్విజోస్తు గురురిత్యేషామనీషామమ" యని మన
గురువర్యులు చెప్పియుండగా మీరు శూద్రకూతలని నీచముగా

భావించితి రేల? శూద్రులూరకనుందురా? గీ॥ శూద్రజాతుండు సూతుండు భద్రపీఠ। మందుఁగూర్చుండి వినిపించె నాదియందు। మహితవేదాదిశాస్త్రముల్ మునివరులకు। సకలశాస్త్రేతిహాస కుల్ శూద్రులుగదా?। అట్టివారల కృతములనట్టి స్మృతుల। నట్టి శాస్త్రపురాణముల్ ముట్టనేల?। చదువ నేల వ్రాయ నేల చదివించు నేల?। సిగ్గులేని గోముఖవ్యాఘ్రములకు అనిశూద్రులు చెప్పిన యెడల మీరేమి బదులు చెప్పెదరు? వారికి కవిత్వమురాదనుకొంటిరా? గీ॥ నైదికాంధ్రగ్రంథంబులు వర్జ్యములని। శాస్త్రివచించె నజ్ఞులు గాన। గార్దభంబెఱుఁగునే గంధపరిమళంబు। బూదిలోఁబడి పొరలుచుఁబోవుగాక యని యనుకొనరా? అయ్యా! "తిత్తిరి, తైత్తిరి, తిత్తిరి, భారద్వాజాదిశబ్దములు ఋషులకును పక్షులకును అన్వయించును. హరిశ్చంద్రశబ్దమునకు సూర్యచంద్రులని యర్థముగలదు. ఒకరాజునకు అర్థమగును. ఇట్టిదాని నెరుంగక వేదమొకడు వాంతిముచేసెనని దానిని కొందరుమానవులు తిత్తిరిపక్షులై భక్షించిరను నిత్యాది యసంభవములనువీావలెనే యందరు నమ్మవలయునని యాజ్ఞాపించెదరా? మీరు "శన్నోమిత్రః శంవరుణః శన్నోభవత్వర్యమా। శన్నఇంద్రో బృహస్పతిః" యను మంత్రమునకు,— మిత్ర=సూర్యమండలాభిమాన దేవత. వరుణ=రాత్రియభిమాన దేవత. అర్యమ=చక్షువుయొక్క అభిమాన దేవత. ఇంద్ర=బలాభి మాన

దేవత. ఇత్యాదిగనానా దేశ వాదార్థము చేయుదురుకదా? ఆర్యులయర్థమదికాదు:—చూడుడు! మిత్రః=ప్రేమాకరపరమాత్మ. వరుణః=సర్వులకు వరణీయమగు నేకమాత్ర పరమాత్మ. అర్యమా=న్యాయకారియగు పరమాత్మ. ఇంద్రః=పరమైశ్వర్యవాన్ పరమాత్మ. బృహస్పతిః=(సమస్త) బృహత్ బ్రహ్మాండమునకు పతియగుపరమాత్మ. ఇత్యాదిగ నొక్కపరమాత్మ యని అర్థముచేసియున్నారు. వారిందుకు పుష్టముగ "తదేవాగ్నిస్తదాదిత్యస్త ద్వాయుస్తదు చంద్రమాః। తదేవశుక్రం తద్బ్రహ్మతాఆపః సప్రజాపతిః" యని వేదప్రమాణమును జూపుచున్నారు. మీదేవతలు ముప్పదిమూడుకోట్లు ఆర్యులేకేశ్వరోపాసకులు. దీనిని మీరెఱుంగ రైరితిరి. నేను మీవాడనే గాని యెవడు యజ్ఞోపవీతమును ధరించి అగ్నిహోత్రకర్మ నాశ్రేపించునో వాడొక ద్విపాద పశువనియు ద్విజుడుకాడనియునాయభిప్రాయము. యజ్ఞోపవీతమును మీరు త్రెంచిపారవైచి యుండినచో మీప్రశ్నలకు నుత్తరమియ్యవలసినదే. మీమెడలో యజ్ఞోపవీతముండగా అగ్నిహోత్రమును ఖడించుటకు మీకధికారమెక్కడదది? ఈసంగతి యటుండనిండు! నిష్కారణముగ మృతులై మోక్షపదవిఁ జేరియుండు శ్రీదయానంద మహర్షిని తిట్టుటకు కారణమేమి? ఇది మొదలు మిమ్ములను యెవరును దుర్భాషము వారని పిలువరు. దుర్మార్గమువారని పిలి

చెదరు. మీజాతక పత్రమును జూచుకొనుఁడు. మీకిప్పుడు మధ్యమదశాంతము; అనిష్టప్రాప్తి; సంకల్పము తూర్పు? గమనము పశ్చిమము, చిత్తము చపలము; మిథ్యాజ్ఞానము; కోపపాపాధిక్యము; అజ్ఞానాంధకార బంధనము: బుద్ధిభ్రమణము; ఈగ్రాహాచారమునకుఁ దోడుగ పర్వతస్థిత పశుపక్షి క్రిమికీట సర్పవృశ్చికాది జంతు విశసనుయోగ ధూమముసోకి మతిచెడినది. ఈయున్మత్తముచేత మీబూతుపుస్తకమును జూచిన వారెంతయో సంతసింతురని యనుకొంటిరిగాని, దానిఁజూచెనవారెల్ల పుటలు చించి పారవేయుదురనియు దానిపై తుప్పున నుమిసి నిప్పులలో వేయుదురనియు నెరుంగకపోతిరి. అయ్యో! తమ బూతుపుస్తకమునందు "సూర్యాదిగ్రహములు గోళములైన-చో సర్వేశ్వరుఁడచేతనుఁడగును. కాన అచేతనునిచే యేలాటిసృష్టి స్థితిలయములును కానేరవు. ఇత్యాదివిషయములు ద్వితీయభాగమున విపులముగా వ్రాయుదుము" అని వ్రాసిన హేత్వాభాసమును చూచి, అహా! మతలో నెటువంటి శాస్త్రిలున్నారని నవ్వనివారు గలరా? సూర్యాదిగ్రహములు జడపదార్థములు గావనియు, చేతనదేవతలనియు వేదశాస్త్రి ప్రమాణములతో నిరూపించిన తరువాత మేమును మీజాతకమును పూర్తిగ ప్రచురించి ఫలమును నిర్ణయించుటకు సిద్ధముగనున్నారము. మఱియు మీరెప్పుడు యజ్ఞోపవీతమును తెంచి విసర్జించి అగ్నిహోత్రము

నుత్యజించితిమని ప్రకటించెదరో అప్పుడు మేమును మీప్రశ్నలకుఁ బ్రత్యుత్తరములు వెల్లడించెదము.

శ్రీ సదానంద శీతారామయోగి,
మద్దగిరి.

## సీతారామశాస్త్రిచర్య



...శ్య జిజ్ఞాస కలిగినప్పుడు వాదవివాదములు భవించును. దీనికి శాస్త్రార్థమని నామాంతరము. దేనిని గురించి వివాదము జరుగునో దాని లక్షణములను మొదట నిర్ణయించవలెను. మొదట బంగారులక్షణ మెరుంగక దానిని పరీక్షించుట యెట్లు? లక్షణమెఱుంగని పరీక్ష లోకములో లేదు. ఈదుర్భాక సీతారామశాస్త్రి, సర్వలక్షణశూన్యుఁడు. ధర్మలక్షణ మెఱుంగడు. ధర్మమును గురించి చర్చించుచున్నాడు. ఈలాగుననే, వేదము-ఆరాధనము- దైవము-ధ్యానముమున్నగువాని లక్షణముల నెఱుంగకనే వానిని గురించి చర్చించుటలో, ఇట్లుగాక మరేముండును? "కుక్కవో నక్కవో ఫణివో కోతివో పిల్లివో బూతపిల్లివో" యను నిత్యాది పద్యములతోడను గద్యములతోడను శ్రీదయానంద మహర్షిని, శ్రీమదార్య నారాయణమూర్తిని,

అనార్యులని, నాస్తికులని, జాతిభ్రష్టులని, యున్మత్త శునకము
లని, చండాలులని, మాంసభక్షకులని, మదిరాపాయులని, పాతకు
లని, నరకవాసులని, వ్యభిచారులని సంకరులని, దేవదూషకులని,
మూఢులని, వంచకులని, కపటులని, హింసకులని, అవిద్యావం
తులని, వేదనిందకులని, చోరులని, అధర్మపరులని, వ్రతభంగకు
లని, దుష్కర్ములని, గురుద్రోహులని, కుకవులని కుక్కలని,
నక్కలని తిట్లరాశిని ప్రోగుచేసి "పంకేన ప్రకారేణ కుర్యాత్
సర్వస్యఖండనమ్" బన్నట్లు ఆర్యులను రుధిరప్రవాహమున ముం
చి చండాల స్వర్గమును జేర్చితిమని వ్రాసిరి. ఈనివేదనము తమ
యారాధన లక్షణము చెప్పగ శాస్త్రికన్వయించునుగాని ఆర్యు
ల కెంతమాత్ర మన్వయించదని చూపెదను.

యాదవవంశజుడగు కృష్ణుడు బలరాముడు మున్నగు
వారు కల్లుద్రాగిరని శాస్త్రిగారి పురాణశాఖలు భాగవతము
లో వ్రాసిరి. అదిశాస్త్రిగారికి ప్రత్యక్షప్రమాణము. కృష్ణభగవాను
లకు వీరు భక్తులు, ఉపాసకులు, ఆర్యులకన్నదో భారతకృష్ణుడు
వేరు. భాగవతకృష్ణుడువేరు. దీనిబట్టిశాస్త్రిగారు యథాదేవస్త
థాభక్త యనునట్లు వంశానుగతముగమద్యపానులని సిద్ధమైనది.
ఇదిరహస్యాచరణమని తమగ్రంథమునతామేవ్రాసికొనియున్నారు.
పాకయాజిగారికి పరమాప్తులై యున్నందున సాధుజంతువులను జం
పువారని మాంసభక్షకులని సిద్ధాంతమైనది. వేదమంత్రములను

లను వైదికకర్మలను నగ్నిహోత్రములను నిందించిరి గనుక మనువుచెప్పినట్లు నాస్తికులైరి. (నాస్తికో వేదనిందకః) ఎవనికి జాతిలక్షణము తెలియదో వాడు జాతిభ్రష్టుడగుట సిద్ధము. గనుక జాత్యేతరుడయ్యెను. ద్రౌపది కైదుగురు పతులని, కృష్ణుడు పరసతియగు రాధను గూడెనని శాస్త్రిగారు నమ్ముచున్నారు గాన పాతివ్రత భంగకులగు జారులైరి. మిథ్యయని తీర్మానముం బొందిన ఫలితమును సత్యమని మిథ్యావ్రాతలు వ్రాసి లోకవంచకులైరి. కల్లలు ప్రకటించి కపటులైరి. విద్యావిద్య లక్షణమెఱుంగక అవిద్యాస్వతులైరి. వైదికకర్మను వెక్కిరించి దుష్కర్మపరులైరి. దుష్టపద్యములు రచించి కుకవులైరి.........అబద్ధములువ్రాసి మిథ్యావాదులైరి. శంకరభాష్యమును ధిక్కరించి గురుద్రోహియయ్యెను. చదువుకొనియు దుష్టగుణములు విడువనందున శిరస్సున మణిగల ఫణియయ్యెను. అనధికార చేష్టలు చేసి కోతియయ్యెను. దొంగయుక్తులుచెప్పి పిల్లియయ్యెను ఇతరులను భ్రమింపఁజేసి నక్కయయ్యెను. "ధర్మాధర్మభయంనాస్తి దశ్వదుశ్శాస్త్రిసన్నిభా" అనునది శాస్త్రియందు సార్థకమయ్యెను. మూర్తిగారెంత యుపేక్షించినను కాలుఁద్రొక్కి కలహము చేసినందున శాస్త్రి కుక్కయయ్యెను. సితమును అసితమని సాధించుటకై యుక్తులుపన్ని తలక్రిందుల తపస్సుచేయు గబ్బిలమయ్యెను. మూర్తిగారికి 116 లు బహుమానమిచ్చినది జూచి

శాస్త్రి మిక్కిలి సంకటపడి దుఃఖాత్ముఁడయ్యెను. శాస్త్రిగారూ! మీయోగ్యతకుఁ దగిన బిరుదును గ్రహించుము? మీరాసు "శ్రీమద నార్యకు వాదీంద్ర ప్రబలప్రతాప ప్రచండ బృహన్మహాపంచక సువివాదవిముఖ ప్రముఖ దుర్భాషా ప్రౌఢవాచస్పతి దుర్లక్షణా విచక్షణదీక్షిత దుర్భాగ్యవంశోద్భవ పాతకభూయిష్ట సీతారామ శాస్త్రిబహాదర్" అను బిరుదు నొసంగితిని. ఇంక నీవేదో, రెం డవ గ్రంథమును వ్రాయుదునంటివే, దానికి తగిన బహుమతి అప్పుడిచ్చెదను. అనృతవాదీ! స్వీకరింపుము.

యమ్. ఆర్యమూర్తి,
హైస్కూల్ విద్యార్థి చిత్రమర్గం.

# నివేదనములు.

—o—

క॥ బ్రహ్మావరంబునఁ బుట్టియు।
బ్రహ్మజ్ఞానంబుగల్గు బ్రాహ్మణులెల్లన్।
బ్రహ్మపదమొందిరిప్పుడు।
బ్రాహ్మణవేషములుమిగులఁ బ్రకటంబయ్యెన్.

అనునట్లు యిప్పుడు వైదిక అగ్నిహోత్ర కర్మలను వేదమంత్రములను ఖండించెడు వారందరు బ్రాహ్మణోత్తములై

యున్నారు. దుర్భాక సీతారామశాస్త్రిగారు అగ్నిహోత్ర
మును దాని విధులను ఖండించుచు వేదనిందయు వైదికకర్మ
దూషణనుజేసిన గ్రంథమును జూచి కొంచమైనను యోచించక
శభాష్‌భలా! యని దుష్టబాపలు కొందరానంద పరవశులైరి.
సద్బ్రాహ్మణు లనేకులు బ్రాహ్మణకర్మలను దూషించెడు బ్రాహ్మ
ణుడు కలడాయని ఆశ్చర్యపడుచున్నారు. ఆర్యులను తిట్టుటయే
పాండిత్యమని తలంచిన తిక్కతలకాయలు లెక్కలేకయున్నవి.
కొందరు సత్యాగ్రహులు ఆదుష్టగ్రంధమును జూచి, ప్రతిఖండ
నములు ప్రచురించిరి. కొందరు

"క॥ మున్నుగనార్యులఁ దిట్టెను।
కన్నుమిన్నుఁగానలేక కాఱెఱుఁడగుచున్ ।
పన్నులుపీకించగవలె।
నెన్నాళ్ళకునైన వీనికెదురగుచుభువిన్ ।

అని పలుకుచున్నారు. శాస్త్రిగారూరుఁ దిరిగి తమ చెడు
గ్రంథమును చాటించుచున్నారు. శాస్త్రిగారెచ్చటను మాకు
లభింపలేదు. గనుక కొన్ని నివేదనము లీమూలమున నివేదింప
వలసి వచ్చినది.

1 శాస్త్రిగారూ! కొండలు యిండ్లు తిప్పలు పాములు
తేళ్లు పక్షులు కీటకములు కాలడము ఆర్యులయొక్క అగ్నిహో
త్రములో సమానమని మీగ్రంథమందు ప్రమాణములు జూప

లేను. అట్లుచూపి పండితులతో రుజువుచేయించువరకు నీవు బ్రాహ్మణుడవు కానేరవు.

2 శ్రీమూర్తిగారు మాంసభక్షకులని మద్యపానులని నీవు రుజువు పరచువరకును నీవు సత్యవాదివి కానేరవు పాకయాజిగారి సాక్ష్య మంగీకరించితివి గనుక నీవు రాక్షసుడవని రుజువైనది. తినిత్రాగుట నీయందే ఘటించుచున్నది.

(3) వేదములోని మంత్రములు వేదమంత్రములు కావని, వ్రాసితివి గావున నీవు మిథ్యావాదివి.

(4) నీవు "ఆశ్వీనస్యాపితే" యనుటకు గ్రంథప్రమాణము జూపుదనని పండితులడుగగా చూపకను అసత్యార్థమును జూపియు, చూపినదానిలో వాక్యము సరిగాలేకుండియు యోగముసంభవించినదని అసత్యమును ప్రచురించి పామరులను భ్రమింపజేసితివి గావున నీవు లోకవంచకుడవు. మహాకపటివి.

(5) మహర్షి దయానందసరస్వతీస్వాములు సాకారధ్యానముచేసిరని అబద్ధములు ప్రచురించితివి గాన నీవు అసత్యశిరోమణివి. అప్రామాణికుడవు.

(6) మూర్తిగారికిని, దయానందులకు, జరిగినవాదమును, రుజువుజేయువరకును, నీవు పరమమూర్ఖుడవు.

(7) నీవు అచ్చువేయించిన ప్రశ్నలకును, వ్రాసిపంపిన ప్రశ్నలకును, భేదములేదని న్యాయస్థానమందు నిర్ధరించవలెను. అంతవరకు నీవు శఠుఁడవు. మఱియు హాఠదురాగ్రహుఁడవు. జిత్తులమారివి.

(8) ఆర్యులు నాస్తికులని వారిగ్రంధములచేత, రుజువు చేయువరకును నీవు పరమదూర్తుఁడవు.

(9) నీగ్రంధమున చండాలసహస్రనామావళి నిండియున్నది, గాన నీవే—చండాలస్వర్గమున గబ్బిలమువలె వేళ్లాడుచు నందరిని బిలుచుచున్నాడవు.

(10) "యజ్ఞోదానంత పశ్చైవపావనాని మనీషిణాం" అను గీతావాక్యమును నీవు నమ్ముచుండియు, అగ్నిహోత్రము వ్యర్థమంటివి గాన నీవు కర్మభ్రష్టుఁడు; పతితుఁడు; పాఖండుఁడు. నీవు యజ్ఞోపవీతమును త్యజించువరకు స్వనియమభంజకుండవు.

(11) మూర్తిగారియందు మూర్తీభవించియుండు ఈశ్వరభక్తియు, నింద్రియనిగ్రహము, జీవదయ, పరోపకారము, దేశభక్తిమొదలగు సద్గుణముల నెఱుంగక దూషించితివి గాన మహాపాపాత్ముఁడవు.

(12) నిష్కారణముగ, మహర్షియు, మహాత్ముఁడు, మహాతేజస్వి, పరిపూర్ణవిద్వాంసుడు, ఆద్యంతబ్రహ్మచారియున గు శ్రీమద్దయానందయతీశ్వరుని తిట్టిన క్రూరకఠోరబ్రహ్మ రాక్షసుఁడవు.

☞ ఈవ్యాసము మిగుల గొప్పది గనుక నింతటితో ముగించు చున్నాము. (సంపాదకుఁడు)

విద్యార్థులు,
S. D. VARMA,
K. MADHAVAN,
R. K. VENKAIAH,
A. BHANU,
K. V. GUPTA.

## ఇది దేని మహిమ?

———o———

క్రమక్రమమున బ్రాహ్మణులు తాముచేయు అగ్నిహో త్రాదివైదికకర్మలపై తామే ఖండనములు వ్రాయుచు వేదమం త్రములను సంధ్యోపాసనమును వెక్కిరించి నిందించుచు గ్రం థములను ప్రచురించిరి. పూర్వమొకప్పుడు నేనీక్రిందిపద్యములను విజ్ఞానవర్ధనీయను పత్రికలో చదివియుంటిని. అవియేవన:—

క॥ ఇల దుర్బ్రాహ్మణులెల్లడ।
బలిసిరి యారోపితముఁగ పాపముబలిసెన్।

తులువతనం బీపారుల।
కులముః కాధారమయ్యె కువివాదములుౕ॥

గీ మందుకైనను బ్రాహ్మణమార్గమరయ।
బొట్టచీల్చియు వెదకినఁ బుట్టదెచట।
నిట్టిబ్రాహ్మణవేషులు నుండఁబట్టి।
కట్టయొట్టిచెట్టల కలికాలమయ్యె?॥

గీ జందెములపొందు బొట్టుపసందు గ్రంథ।
పఠనస్నానజపతపముల్ వరుసఁజేసె।
నేఁబ్రాహ్మణవేషుండు గాని నిజము।
బ్రాహ్మణుండౌనె బ్రహ్మత్వపటిమలేక?॥

ఇత్యాదులు. ఇప్పుడు నిదర్శనముగ జరుగుచుండుట జూచుచున్నారము. ఆర్యులు వైదికకర్మలు వ్యాపింపజేయుట్కై సంస్కారవిధి సంస్కారచంద్రిక అగ్నిహోత్రిలాభము మున్నగు గ్రంథములు ప్రచురించియుండగా వీనిని వినాశనముచేయుటకు బుక్కపట్టణనివాసుఁడగు శీతారామశాస్త్రి యను నతను అగ్ని హోత్రమును తన్మంత్రములను విధులను సంధ్యోపాసనను ఖండించుచు కేవలము తిట్లతోనిండిన యొకగ్రంథమును ప్రచురించియున్నాడు. ఇతడు నిజముగ పిచ్చివారియాస్పత్రిలో నుండదగినవాడనుటకు నిదర్శనముఁ జూడుడు.

యజ్ఞములో పశువధ తగదని వ్రాసినదానిని ఖండించుచు
మరల నట్లు మహీధరుడు భాష్యము చేయలేదనుచున్నాడు. మ
హీధరుడు స్పష్టముగ "యేవాజినం" అను మంత్రము
నకు పరిష్కారముగ "యేజనాః పక్వం వాజినమశ్వం పరిప
శ్యంతి అయంపక్వ ఇతిజానంతి। య ఈమిత్యాహగయం చార్థేయే
చ ఇత్యాహుః ఏవంకథయంతికిమ్ సురభిః సుగంధపాకోజాతః
అతోనిర్హరఅస్మేన కాశామత్తారయేతి। యేచజనాఅర్వతో
శ్వస్యమాంస భిక్షాముపాసతే హంతిశిష్టమాంస యాచనాంకు
ర్వంతే" ఇత్యాది యజ్ఞమందు అశ్వములను వధించి వానిమాం
సము పక్వముచేసి భక్షించుట వేదవిధియని భాష్యమును వ్రా
సినాడు. అతని భాష్యమునను సరించియే యిప్పుడు తైత్తిరీయ
శాఖవారు పశువినసయాగములు చేయుచున్నారు. ఇదే మం
త్రమునకు శ్రీమద్దయానందసరస్వతీస్వాములవారు "యేఽర్వ
తో మాంసభిక్షాముపాసతే చయేఽశ్వమిమం హంతవ్యమాహు
స్తాన్నిర్హరదూరేప్రక్షిప। యేవాజినంపక్వం పరిశ్యంతితతో అపి
తేషాం సురభిరభిగూర్తిర్న ఇన్వతిత్వితి। యేఽశ్వాదిశ్రేష్ఠానాం
పశూనాం మాంసమత్తు మిచ్ఛేయుస్తే రాజాదిభిః శ్రేష్ఠైర్నిరో
ద్ధవ్యాయతో మనుష్యాణాముద్యమసిద్ధిఃస్యాత్" ఇత్యాదిగ
మానవోద్యమసిద్ధికొఱకు రాజులు పశ్వాదులమాంసమును భ
క్షింపగోరు దుష్టులను దేశమునుండి దూరముగ వెడలగొట్టి ప

శ్వామలను రక్షింపవలయునని భాష్యము వ్రాసినారు. ఈశీతా రామశాస్త్రిగారు తమ బూతులపుస్తకములో కట్టకడపట "దయానందసరస్వతీస్వాములవారి పుస్తములలోగల వివేచనను చక్కగా గమనించి చూడు" డని పాఠకులకుఁ జెప్పిరి. ఇప్పుడు శాస్త్రిలవారు పాఠకులకేమిబోధించిరని మనమనుకొనవలయును? జంతువులజంపి యజ్ఞముచేసి మాంసము తినవలయునని చెప్పిన మహీధరభాష్య మంగీకరించికదా దయానందులను నాస్తికులని అనార్యులని నిందించిరి. సాధుజంతువులను జంపరాదనియు, నట్టివానిమాంసముఁ దినఁగోరుదుష్టులను దేశమునకు దూరముగ తొలగించవలయుననియు, సాధుజంతు సంరక్షణము వేదధర్మము నిచాటించిన దయానందులు అనార్యులు నాస్తికులు పాతకులై వానిని జంపితినవలెనను వారార్యులై ఆస్తికులై పుణ్యాత్ము లగుదురన్న శాస్త్రిగారివాద మెంతయోగ్యమైనదో పాఠకులు తెలిసికొందురుగాక! శాస్త్రిగారికి భారతమంతయు ప్రమాణ మట భారతమందు పతిపరదేశమునమండగా వానిసతి పరపురుషు ని పొందుగోరినప్పుడు దానిని పొందకపోయినచో భ్రూణహత్య పాతకము సంభవించునని చెప్పియుండుట అనేకులు చదివియు న్నారుకదా? దీనిని స్వతఃప్రమాణముగ శాస్త్రి లంగీకరించునా వెయ్యిమాటలేల పండితులకు రెండుమాటలే చాలియుండును.

శాస్త్రిగారి గ్రంథము మానవమాత్రులకు ముట్టుటకు తగియుండలేదు.

యస్. వి. హనుమంతరాజు.

# ఆర్యలక్షణము

శ్లో॥ యాస్స్మృత్యవిద్యాభువిసంతితాసాం వేదోఖిలః పుస్తకమాదిభూతం వేదస్యతస్మాత్ పఠనంచపాఠనం పరంశ్రుతిః శ్రావణమార్యధర్మః॥

శ్రుతిస్మృతిహితాచార శుద్ధాహారస్సునీతిమాన్। ప్రీతిమాన్ యోభవేద్దేవేసఆర్యః పరికీర్తితః॥

ఉ॥ సర్వనియంతు డీశ్వరుడు సాక్షియజన్ముడుసర్వతోముఖుం।
డుర్వియునాకసంబఖిలయుగ్గములోకసమీహితప్రదక్షుడున్।
నిర్వచనీయు డవ్యయుడు నిత్యుడరూపుడనంతుడంచునీ।
యుర్విదలంచు నాతడొకయార్యుడనంబరుగున్సహోదరా॥

ఉ॥ మానవమందునీశ్వరుని మానకధ్యానసమాధినిష్ఠలన్।
తానుదలంచుచున్ ధరసదాచరణంబును వేదనిష్ఠతన్।

బూనిపరోపకారమును: బేరునుఁగోరక నాచరించుచున్।
యూనతియంచునుండు నతఁడార్యుఁడనంబరుగున్ సహోదరా।

ఉ॥ మద్యముమాంసమున్ మఱియుమైకపదార్థములన్ ద్యజించి యున్।
విద్యవివేకసంపదయు వాస్తవబుద్ధియు సౌరవీరతన్।
యుద్యమమూఁతిగాఁగొనియు నార్జితమాన సుఁడై గడించు చున్।
నాద్యము నైన వేదవిదుఁడార్యుఁడనంబరుగున్ సహోదరా॥

ఉ॥ ఎవ్వఁడుదీనులన్నిరత మిష్టజనంబులసాధువులన్।
నొవ్వగఁజేయకుండఁదగు నెయ్యముఁజూపు మగారవింపుచున్।
గ్రొవ్వును ద్వేషభావమునుఁ గూరిరమసత్యము నుజ్జగించునో।
యివ్వసుధాస్థలిన్నతఁడె యార్యుఁడనంబరగున్ సహోదరా॥

ఉ॥ వందనమంచు వంద్యులను వారకఁబల్కుచు నీతిమంతుఁడై।
నిందితకార్యముల్విడిచి నీచులఁజేరకనిర్భయంబుగా।
నందఱునొవ్వఁబల్కనను యారయకార్య పథానువర్తియై।
యందుపదేష్టయై చనతఁడార్యుఁడనంబరగున్ సహోదరా॥

ఇత్యాదిగ ఆర్యలక్షణంబులుగలవు. పాఠకులారా! శ్రీ మూర్తిగారి గ్రంథములన్నిటిని శోధించుడు వారి గుణకర్మ స్వభావాదులను విచారించి తెలిసికొనుఁడు. పిమ్మట శాస్త్రిగారి

రొక్కయు వారి మిత్రులగు పాకయాజిగారి కరపత్రములను పఠిం చుము. అనార్యు లెవరో ఆర్యులెవరో మీకు స్పష్టముగఁదెలి యును. అనార్య మతఖండనమని యొక్క-చోటను ఆర్యమత ఖండనమని యనేక-చోట్లను వ్రాసియుండుటను మీరుచూచెదరు.

1 "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మ రన్" (గీత॥) ఓమిత్యేవంధ్యాయథ" (ముండ) యిత్యాది ప్రమా ణములను త్యజించి ఓంకారస్మరణనుమాని "శ్రీరామచంద్రప్రస న్న" మని మానధ్యానముఁజేయువాఁడార్యుఁడెట్లగును?

2 "రాష్ట్రంవా అశ్వమేధః—అగ్నిర్వాఅశ్వః-ఆజ్యమేధః- అన్నంహిగౌః" ఇత్యాది శతపథాది బ్రాహ్మణగ్రంధప్రమాణ ములను పరిత్యజించి, పశువులను జంపి యజ్ఞముచేయు తైత్తిరీ య శాఖవారు బ్రాహ్మణులెట్లగుదురు? ఆర్యులెట్లగుదురు? శీగా రామశాస్త్రి! "ఆర్యులు గోప్యముగ మాంసముదినుచు మద్య పానముచేయుదు" రని మిథ్యావ్రాతలు వ్రాయుటవలన నీతైత్తి రీ యాంధకార బంధురమును శాంతమునకు నల్లని, యవైదిక కర్మలను మూసిపెట్టదలంచితివా?

శ్రీయాదిశంకరులు తమ బ్రహ్మసూత్ర భాష్యమందు "అధిష్ఠానుపపత్తేశ్చ" యను సూత్రమునకు "సృష్ట్యుత్తరకాల భావిత్వాచ్ఛరీరస్యప్రాక్ సృష్టేస్తదనుపపత్తేః" అని యీరీతిగ నీ

శ్వరుఁడు శరీర ధారికాదనియు శరీరధారి సృష్టికర్తకాజాలడనియు పరిష్కారముగా వ్రాసియుండగా నీవు నిరాకారుఁడెట్లు సృష్టికర్త యగునని ప్రశ్నించుచున్నావు. ఈవిషయమున మీగురువు సయిత మార్యసిద్ధాంతమును స్వీకరించియున్నాఁడు. ఆర్య్వుల యజుర్వేదమందు దేవుఁడు "అకాయ మరూపమవ్యయం" బని వర్ణింపఁబడియున్నాఁడు. మీనల్లని తామస కృష్ణ యజుర్వేదమందు "సకాయ సురూప మవ్యయం" బని యున్నదేమి? ఇందుకై నొక యసత్యమును వ్రాయుట మేలనుకొని దయానందులు సాకారేశ్వర ధ్యానము చేసియున్నారని కల్ల వ్రాత వ్రాసితివికదా? ఇట్లే మీశంకరులపై యొక మిథ్యను కల్పింపకయుందువా? నీవ్రాతలను పరిక్షించి చూడగా నీవు ఆర్యుఁడునుకావు. బ్రాహ్మణుఁడును కావు. అసత్యవాదీ! ఇప్పుడైనను చెప్పగలవా? నీగ్రంధ మనార్య మతఖండనమా? ఆర్యమతఖండనమా? కొంచెముమైకముఁదింపుకొని మాటలాడుము. నీవు గాత్రిమగాత్రిమములుతిరిగి చాండాలోపన్యాసముల నిచ్చియిచ్చి చచ్చినను నేమియు నీకోరిక సిద్ధించదని దృఢముగా నమ్ముము.

**Arya Bhanu.**

# స్వాభిప్రాయము.

:o:

పాఠకమహాశయులారా! స్వాత్మ నిరీక్షణమను గ్రంథము ను మొదటకొన్నిపుటలను పఠించుడు! అందు స్వాత్మ నిరీక్షణము లేని వారేమిచేయుదురో-యెట్లు ప్రవర్తింతురో విశదముగనున్నది. తరువాత. దు. శీతారామశాస్త్రిగారి గ్రంథమును జూడుడు. త మ్ముతాము తెలియని దోషమే, వారినిట్లు చేసినదని విస్పష్టము కాగలదు. వారికి మాయందు ద్వేషభావము గలదు గాని వారు మాకు ద్వేషులుకారు. గనుక మిత్రభావముతో వారిని వారిమి త్రులను స్వాత్మ నిరీక్షణమును పఠించవలయునని పలువిధముల ప్రార్థించుచున్నారము. వారి గ్రంథమునకును, వారికిమీాద వ్రా యువాని నన్నింటికిని, స్వాత్మ నిరీక్షణమును పఠించుమని మాత్ర మే ప్రత్యుత్తర మిచ్చెదము.

ఆర్య నారాయణమూర్తి

సంపాదకుడు.

వైదికాంధ్ర గ్రంథమాలికా,

హిందూపురం.

# పండితుల అభిప్రాయములు.

———:o:———

శ్లో॥ నమోదయానంద సరస్వతీగురుమ్।
చతుర్వేద సభాష్యసంస్కృతమ్॥
నమో ప్రపూజార్య మతప్రదీపమ్।
నమోస్తు నారాయణమూర్తి విద్వాన్॥

ఆర్యా! మనరాజధానిలో వైదికమంత్యాన్యములను విరోధించినవారికి గర్వ భంగముగ వైదిక సిద్ధాంతములన్నియు సత్యములని నిరూపించిన మీ ప్రయత్నమత్యంతశ్లాఘనీయము. మీకు పరమేశ్వరుఁడు తోడగుఁగాత!          ఇత్యాది.

యలవర్తి రామకృష్ణయ్య,
కూచిపూడి.

సీ॥ అందమై సజ్జనానందమై వేదసం
బంధమై యమృతనిష్యందమగుచు।
శ్రావ్యమై విబుధ సంభాష్యమైమానిరా
క్షేప్యమై కలుషజేతవ్యమగుచు।
సారమై లలిత వాక్పూరమై పాతదురా
చారమై ధర్మవిస్తారమగుచు।

సత్యమై మానకాచిత్యమై నిత్యస
త్కృత్యమై మాధ్యరాహిత్యమగుచు॥

గీ॥ జనుల కీశ్వరరాహస్యసారమహిమ।
నెఱుకజేసెడుకొఱకు త్వదీయరచిత।
గ్రంధమెల్లను జదువ హృద్గ్రంధివీడె।
హర్ష! మిగురొత్తె నారాణార్యవర్య॥

రామాయణం వెంకటస్వామివర్మ.

మిత్రమా!

మీరుప్రకాశికలో "తైత్తిరీయ శాఖోత్పత్తి" యను వ్యాసమును ప్రకటించితిరి. అది కేవలమసంభవమని నేను నమ్మకసందేహించుచుంటిని. తాము దానిని యొక యలంకారముగ పారిభమికులు లక్షణముననుసరించి వ్రాసి వర్ణించినారంటిరి. నా సందేహమిప్పుడు తీరినది. మలినమైనదనుటకు నాంతమైనదియు ద్విజ శబ్దమునకుగల రెండర్థములను, శుక్లకృష్ణములకు సత్వతిమోగుణములనియు కారణయుక్తముగ వ్రాసితిరి. శాస్త్రిగారి గ్రంధమును చూచి చాలదుఃఖించితిని......"సాక్షరాహి విపరీతశతాః జగతి తేపిరాక్షసాః", యన్నట్లయ్యెను. "పూర్ణ మదఃపూర్ణమిదం" బను మంత్రము, ముండకోపనిషత్తులోనిది. పూర్ణాహుతిలో దానిని చెప్పుటవలన మంత్ర వినియోగ దోషమెంతమాత్రములేదు. మేముచెప్పుచున్నాము. ఎ. అమృతభట్ట.

శ్రీమదార్య నారాయణమూర్తిగారి గ్రంథములు ప్రతి గ్రంథాలయమందును, ప్రతిసమాజమందును, ప్రతిమతబోధకుని హస్తమందును, ప్రతి ఆంధ్రుని కరమందును నుండతగినవి. జ్ఞాన ధనము సంపాదించనెంచిన ప్రతివారును పఠింపవలయును.

ఇత్యాది. ది. నాగేశ్వరరావు.

ఆంధ్రప్రకాశిక

11–11–1918

మనదేశమున ననేక యాంధ్ర గ్రంధసరోవరములును, మరియు ననేక యాంధ్ర గ్రంధ సంకర్తములునుగలవు. ఆలాగుననే గ్రంథ పాఠకులును, సరోవరమందలి మీనములవలెను, మరియు మురికిగుంటలలోని యెనుము దున్నలవలెను రెండువిధములుందురు. శ్రీమదార్యనారాయణమూర్తిగారి గ్రంధసరోవరమున నొక్కసారి యధ్యయసస్నానమాచరించుటవలన మనోవృత్తి స్వచ్ఛమై జీవాత్మ పవిత్రమై బుద్ధిపరిశుద్ధమై ప్రకాశించును. ఈగ్రంధములన్నియు సంఘములకు బ్రస్ఫురిత చిత్రములై మూఢనిద్రా పరవశులకు మేలుకొలుపులై ఆత్మోద్ధారకములై యొప్పుచున్నవి. ఇత్యాది.

యం. జీ. సుందరరావు.

15—2—1919 ఆంధ్రప్రకాశిక

